సం॥ర చందా రు 1-0-0 (పోస్టేజితోసహా) Reg. No. M. 3766

సంపుటము 31 సంచిక 2

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

మే 1942

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రొప్రయిటరు:

రామా అండ్ కో.,

హెడ్ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్ :— మద్రాసు - గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr. Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# విషయసూచిక



— —

# హెచ్చరిక



## ౧. చందాదారులకు

చాలమంది చందాదారులు, వ్యాసకర్తలు తమకు పత్రికలు చేరుట లేదనియు,ఏదో నెల పత్రిక (రెండుమూడు నెలలక్రిందటిది) పంపవలసినదనియు తఱచు మాకు వ్రాయుచున్నారు. ఈ తీరున ఆలస్యముగా వ్రాసినందువలన లాభముండదు. ఏనెల పత్రికలు ఆనెలకే అయిపోవుచుండుటచేత ఆలస్యముగా వ్రాయువారికి మేము పంపలేకున్నాము. కాబట్టి పత్రికలు సకాలములో చేరని వారెల్లరు ప్రతినెల 20 వ తేదీలోగా ఏలూరు, హెడ్డాఫీసుకు మాత్రమే వ్రాసి సదరు పత్రికలు తెప్పించుకోవలెను. మాపత్రిక ప్రతినెల 15 వ తేదీని ఏలూరులో వెలువడును. ఆలస్యముగా వ్రాసినను నాకు వ్రాసినను, ప్రయోజనముండదు.

చందాదారులగు వారెల్లరు - ఇదివఱకు చేరినవారుగాని, క్రొత్తగా చేరువారుగాని - తమ చందాధనమును నాపేరపంపకుండ సరాసరి ఏలూరు, హెడ్డాఫీసుకు మాత్రమే పంపుచుండవలెను.

## ౨. వ్యాసకర్తలకు

మాపత్రికకు వ్యాసములు వ్రాసి పంపువారిలో చాలమంది ఏలూరుకు పంపుచున్నారు. ఇందువల్ల అదనపు తపాలాఖర్చులేగాక కొన్ని వ్యాసములు సకాలములో నాకు చేరక పోవుటయు, ప్రచురణము గాకపోవుటయు, తటస్థించుచున్నది. కాబట్టి వ్యాసకర్తలెల్లరు తమ వ్యాసములను సరాసరి నాపేర సత్తెనపల్లి చిరునామాకు ప్రతినెల 5 వ తేదీలోగా పంపుచుండవలెను. ఏదైనా నావల్ల సమాధానము బడయగోరు వారెల్లరు అందులకగు తపాలా బిళ్ళలను పంపుచుండవలెను. లేకున్న ప్రత్యుత్తరములు రాజాలవు.

సంపాదకుఁడు.

ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము | ఏలూరు 15 మే 1942 | సంచిక |
|---|---|---|
| 31 | | 2 |


# నిత్యసంకీర్తనము

**వివరణము :**

మనజీవిత కేంద్రమును సమీపించుటకు ఎపుడును ఆలస్యమనునదిలేదు. కొంత కాలమునకు మనకు విసుగెత్తవచ్చును - నిరాశజనింపవచ్చును. అప్పుడుగూడమనమా కేంద్రమునే ఆశ్రయింపవచ్చును. కాలమెప్పుడును అనుకూలించియేయుండును. అచటికి చేరితిమా మనకింకనెట్టిభయమునులేదు. ఈకేంద్రముతో సంబంధము లభించనిచో మన పనులన్నియు వ్యర్థమగును. లభించెనా సంశయములన్నియు విడిపోవును. మానవుని యశాంతతకు, అసౌఖ్యమునకు, కారణమేమి ? కేంద్రముతో నాతనికి సంబంధములేక పోవుటయే!

**సంకీర్తనము :**

1. పరమేశ్వరా ! ఈమాయా మోహమునుండి నాచిత్తమును ఉద్ధరింపుము.
2. నిన్నువెదకెడి నాయత్నములను సఫల మొనర్పుము.
3. నీవే జ్ఞాన జ్యోతివి. విజ్ఞాన నిలయమవు
4. నామార్గమును నీదివ్యతేజస్సుతో వెలిగింపుము

—స్వామిరామతీర్థులు.

# మన రాష్ట్రవిద్య

## (విద్యాశాఖ డైరెక్టరు వారి రిపోర్టుపై గవర్నమెంటు సమీక్ష)

ఈ సంవత్సరమునందు అప్రయోజనకరమైన పాఠశాలలను మూయుటవల్ల, వాని సంఖ్య యింకను తగ్గినది. కాని విద్యార్థులసంఖ్య 3,306,732 నుండి 3,329,294 వరకు హెచ్చినది. అన్ని తరగతులలోని విద్యార్థినుల సంఖ్య 1941-42 సం॥లలో వెనుకటికంటె 44000 ఎక్కువయైనది. ఇంకను యిట్లుగలదు.

ప్రాథమికపాఠశాలలో 5 వ తరగతి చదివిననే గాని విద్యార్థి శాశ్వత అక్షరాస్యుడై యుండజాలడు. అందువలన పూర్తిగా 5 తరగతులు గల పాఠశాలల సంఖ్యను పెంపొందించుటకు విద్యాశాఖ వారు కృషిచేయుచున్నారు. అట్టి పాఠశాలలు 2914 వరకు వృద్ధియైనందులకు ప్రభుత్వమువారు సంతసించుచున్నారు. ఆ తరగతిలో చదువుచున్న విద్యార్థుల సంఖ్య గత సంవత్సరము కంటె యీవృద్ధి తక్కువ యైనను - వృద్ధిచెందుట ముదావహము. ఈ వృద్ధితో పోల్చిచూచిన, తగ్గిపోయిన పాఠశాలల సంఖ్య అంత ముఖ్యమైనదిగాదు. ఏలనంటే శాశ్వత అక్షరాస్యుల సంఖ్య అట్టివారిని తయారుచేయుటకు పనికివచ్చు పాఠశాలల సంఖ్య యీ రెండును మనకు ముఖ్యమైనవి. ఈ సందర్భములో ఒకటవ తరగతిలో చదువుచున్న విద్యార్థుల సంఖ్య తగ్గుటను విద్యాశాఖ డైరెక్టరువారు గమనింపదగియున్నది. మరియొక సంతోషకరమైన అభివృద్ధి యేమన బాగుగా విద్యాబోధన జరుగుటకుగాను సుశిక్షితులైన యుపాధ్యాయుల సంఖ్యగూడ హెచ్చినది.

కాలేజీలలో చదువు విద్యార్థుల సంఖ్య 14,177 నుండి 15894 వరకును, సెకండరీ పాఠశాలలలో చదువువారిసంఖ్య 210,282 నుండి 223,815 వరకు హెచ్చెను. కళాశాలలలోని విద్యగూడ నీరీతి బాహుళ్యము జెందినది.

కుంభకోణం మునిసిపాలిటీయందు బాలికలకు నిర్బంధ విద్య యేర్పాటు చేయబడినది. హాస్‌పేట మునిసిపాలిటీ వారు తమ గ్రామములో బాలుర నిర్బంధమును నమలు జరుపు స్థితిలో లేమనియు, దానిని తొలగింపవలసినదనియు కోరుట చేతను అది రద్దుచేయబడినది. ఇట్టికోరికయే నార్తు ఆర్కాటు జిల్లాబోర్డునుండి వచ్చుటచే నట్రాంపల్లి, అగ్రహారం గ్రామములలో నిర్బంధము తొలగింపబడినది.

హయ్యర్, సెకండరీ గ్రేడు, ఉపాధ్యాయుల గ్రాంటు, రు 156, రు 212ల నుండి వరుసగా రు 168, రు 216 ల వరకు హెచ్చింపబడినది. దీనివలన రు3.44 లక్షలు అధికవ్యయమయ్యెను. 1939-40 సం॥ లో బడ్జటు ప్రొవిషను తక్కువగుటచే, కొన్ని పాఠశాలలకు ప్రొరాటా కట్ యివ్వబడినది. అట్టి తగ్గింపులను పూర్తిచేయుటకై 1940-41 10.44 లక్షల రూపాయలు అదనముగా నివ్వబడినవి.

ప్రాథమికపాఠశాలల విద్యాప్రణాళికను పునర్విమర్శించుట కేర్పాటు చేయబడిన

ఒక సంఘము, హయ్యరు ఎలిమెంటరీ పాఠశాలావిద్య అయిన తరువాత పబ్లిక్ ఎగ్జామినేషన్ పెట్టవలెనని సూచించినది. దీనియొక్క యుద్దేశ్యము ప్రత్యేకముగా ప్రాథమిక పాఠశాలవిద్య పూర్తియైనదని తెలుపుటకును, బోధనాభ్యసన పాఠశాలలలో ప్రవేశించువారికిని, మరియితర టెక్నికల్ పారిశ్రామిక పాఠశాలలలో చేరువారికిని, కనీస యోగ్యతగా పనికి వచ్చుటకునునై యున్నది. ఈ కమిటీ సూచనను ప్రభుత్వము అంగీకరించినది. మొదటి పరీక్ష 1942 సంవత్సరములో జరుగును.

ప్రాథమిక పాఠశాలలలో నూతన విద్యాప్రణాళీక నములు జరుపుటచే, దానికి తగినట్లుగా బోధకులను తయారుచేయుటకు ట్రెనింగు పాఠశాలలలో మార్పులు చేయబడినవి. ఈ నూతన పద్ధతి ననుసరించి శిక్షణ, హయ్యర్, సెకండరీ, అను రెండు తరగతులలో నివ్వబడుచున్నది. వెనుక యుండిన మూడవగ్రేడు తీసివేయబడినది.

### పాఠశాలలలోని బాలికల యభివృద్ధి

అన్ని తరగతులలోను చదువుచున్న విద్యార్థినుల సంఖ్య 44000 పెరిగినందులకు ప్రభుత్వమువారు సంతసించుచున్నారు.

మహమ్మదీయవిద్య సాధారణ జనాభా వృద్ధికితగినట్లుగానున్నది. కళాశాలలలోను, సెంకడరీ పాఠశాలలలోను, యీ సంఖ్య పెరిగినది. ప్రాథమిక పాఠశాలలలోని విద్యార్థులసంఖ్య తగ్గినది. కాని 5వతరగతిలోని విద్యార్థులసఖ్యమాత్రము పెరిగినది.

షెడ్యూల్డు జాతి విద్యార్థులసంఖ్య మాత్రము వెనుకటివలెనే యున్నది. ఇది సంతృప్తికరముగా నున్నదని చెప్పుటకు వీలులేదు.

రాజధానియందంతటను, వ్యాయామ సంఘముల యందభివృద్ధి గలదని కనుగొనుటకుప్రభుత్వము చాల సంతసించుచున్నది.

శరీరవ్యాయామమునకు ప్రోత్సాహమిచ్చుటకుగాను గవర్నమెంటువారు, హైస్కూళ్లలోని విద్యార్థులశరీరయోగ్యతను గురించియు వ్యాయామ విద్యనుగురించియు రిమార్కులను, వివరములను, వారిసర్టిఫికట్టులందును, యుపాధ్యాయులకు, వారిటీచింగుసర్టిఫికెట్టులందును, గుర్తించుటకేర్పాటుచేయునట్లు డైరెక్టరువారి సలహానుగవర్నమెంటు వారా మోదించినారు. ఈ నూతన పద్ధతి యీసంవత్సరము ప్రవేశపెట్టబడి, శరీర వ్యాయామము నిర్బంధమొనర్పబడినది.

కాగితముకరవువలనను, అచ్చుసౌకర్యలుతక్కువైనందువల్లను, డైరెక్టరువారి రిపోర్టులోని కొన్నిభాగములు అచ్చువేయబడలేదు. (సం)

---

ఓమ్

# ఒకటవ తరగతికి తెలుగు భాషను నేర్పుటకు మొదటి పాఠములు

(పరిగె వెంకటరమణరావు, సీనియర్ డిప్యూటీ ఇన్‌స్పెక్టరు, పల్నాడు.)

## మనవి

[నూతన సిలబసును అనుసరించి ఒకటవ తరగతికి తెలుగుభాషను నేర్పుటకు వాచకములు యిప్పటికి యెన్నో యెంతమందిచేతనో వ్రాయబడి, ప్రచురింపబడి వాడబడుచున్నవి. శ్రేష్ఠమగు క్రమమును అనుసరించితిమని, బాలుర అనుభవములో ప్రతిదినము వాడబడు పదములనే వాడితిమని, అక్షరములను నేర్పుట గుణింతపు పురాతన పద్ధతిని అవలంబించుట మాని నూతన మానసిక తత్వశాస్త్రానుగుణ్యముగ మాతృభాషా బోధనమును చేయదగునటుల వ్రాసితిమని ప్రతి వాచకపు కర్తలు - ప్రచురించినవారు - వ్రాయుచునే యున్నారు

అయితే, ఏవాచకములో కూడను యీ వ్రాసిన వ్రాతలను పూర్తిగ అనుసరించి యుండలేదు. అందుచేత, యే వాచకము కూడను, అందలి ప్రథమ భాగములలో, పిల్లలు తమ అనుభవములో వినుచుండి వాడు పదములను మాత్రమే కలిగియుండలేదు. ఇంతేకాక మాతృభాషను పిల్లలు నేర్చుకొనుటలో పాడిపాడి పదములను మాత్రమే యెల్లప్పుడును వాడుచుండుట సహజము కాదు అను విషయమును గుర్తించి, క్రొత్తపదములను నేర్చుకొనుట తోడనే ఆ పదములను వాక్యములలో నుపయోగించి వాడుటను అనుసరించి వ్రాయబడిన వాచకములు చాల కొలదిగనే యున్నవి ఈ పద్ధతిని అవలంబించినటుల కనుపించినను, పిల్లల స్వానుభవములోని పదములనే నేర్పయత్నించినవాచకము ఒక్కటియు కనుపించదు.

మాతృభాషను (తెలుగును) నేర్చుకొనుటలో పునాదిని సరిగా వేసిన తరువాత యే వాచకమునైనను వాడుకొనుటకు ఉపాధ్యాయుడు తోడ్పడవచ్చును. అందుచేత, యీ క్రిందను సూచించిన పాఠములను ఒకటవ తరగతిలో తెలుగును బోధించుటకు మొదటి పాఠములుగా వాడి, అక్షరములను మాటలలో గుర్తించుట, గుణింతమునుకూడా త్వరలో బాధ-విసుగు-అవసరము-లేకుండ నేర్పుట, యింతవరకు అర్థములేకుండ, అర్థమును చెప్పకుండ నేర్పిన లోకంటి పద్ధతిని వదలుట, పిల్లలకు నేర్పు మాటలు, వారిచే ప్రయోగించు వాక్యములు, వారికి అర్థయుక్తములుగ నుండునటుల, సాధింప ఉపాధ్యాయ సోదరీ సోదరుల కందరకు విన్నవించుచున్నాను.

ఇందు తయారుచేసిన మాటలు మూడు నిలువు వరుసలలో విభజింపబడి యున్నవి

(1) తన శరీరమునకు, తనకు,
(2) తనయింటికి, యింటిలోని వారికి,
(3) తన బడికి, బడిలోనివారికిసంబంధించినది,

ఉపయోగింపబడుచున్నవి తనకు సంబంధించని మాటలు, ప్రత్యక్ష అనుభవములో తాను చూచి, విని, అనుభవించనివి త్యజింపబడినవి

ఇందలి మాటలను నేర్పుటకు బొమ్మలను తమ దగ్గరనున్న యేవాచకములో నుంచియైనను చూపవచ్చును

ఇందలి మాటలను, వాక్యములను, అట్టలమీద వ్రాసి, వానిని ఫ్లాష్ కార్డులవలె ఉపయోగించవచ్చును ఒక్కొక్క వాక్యములోని ప్రతిమాటను విడివిడి అట్టలమీద తయారుచేసికొని, మాటలను గుర్తించుటకు (అందలి అక్షరములను కూడ గుర్తించుట అప్పుడే జరుగును), మాటలతో వాక్యములను తయారుచేసి జదువుటకు వాడవచ్చును. ఎంతమంది పిల్లలుందురో అన్ని ఒక్కొక్క మాటలను, అన్ని ఒక్కొక్క వాక్యములను, అట్టలమీద తయారుచేసికొని, ఉపకరణములుగా ఉపయోగించుట పరమోత్తమ విధానము.

ఒక్కొక్క గుణింతమునకు దాదాపు అయిదు మాటలను నేర్పసూచింప బడినది ఆ మాటలను, ఆ వాక్యములను నేర్పిన తోడనే, గుణింతపు గుర్తును దాని ప్రయోగమును, సూత్రీకరించునది. ఇంకొక అక్షరమునకు ఆగుర్తు కనుపించిన పిల్లలు గుర్తించి చదువుటకు తోడ్పడునది.

ఈ క్రిందనిచ్చిన మాటలన్నియు పూర్తికాగా మిగిలి పోయియుండు అక్షరములు గుణింతపుగుర్తులు

చాలకొద్ది; వానిని తటస్థించిన సందర్భములో బోధించవచ్చును.

ఈ పాఠముల వరుసను చదవనేర్పుటకు ఆరు మాసములు చాలవచ్చును. ఒకటవ తరగతిలోని మిగత కాలములో వ్రాత, ఇతర చదువులు వాచకములలో సాగింపవచ్చును.

ఈ క్రమమును సాధించి ఫలితమును, అనుభవములను, తెలిపిన, యింకను వినియోగింతును. ప్రయత్నింపుడు. తెలుగును నేర్చు కుఱ్ఱలు కృతజ్ఞులగ నుందురు ]

వ॥ వెం॥ ర॥.

## గుణింతములేని మాటలు

| శరీరము | ఇల్లు | బడి |
|---|---|---|
| 1 తల | 1 ఈగ | 1 కథ |
| 2 దవడ | 2 గడప | 2 ఓడ |
| 3 కణత | 3 ఉలవ | |
| 4 జడ | 4 శనగ | |
| 5 ఎడమ | 5 బయట | |
| 6 చమట | 6 బస | |
| 7 నగ | 7 ఊయల | |
| 8 ఐదవ | 8 అబక | |
| 9 ఒక | 9 భజన | |
| 10 రమణ | 10 ఆయన | |

## ా

1 నా 1 తాత 1 పాఠశాల

2 రాధ 2 మా

1 ఆయన నా తాత

2 మా రమణ

3 రాధ మా పాప

4 నా పాఠశాల

## ి

1 ఇది 1 కిటికి 1 బడి

2 నాది 2 గది 2 మనిషి

3 అది

1 ఇది నా తల

2 ఆ పలక నాది

3 ఇది నా ఎడమ దవడ

4 ఇది మా బడి కిటికి

5 అది మా గది

6 అది మా బడి

7 కమల ఆడమనిషి

## ీ

1 నీ 1 పీట 1 వీధి

2 సీత

3 మీ

1 ఇది నీ ఎడమ కణత

2 అది నా పీట

3 సీత మీ పాప

4 ఇది మా వీది

## ు

1 ముఖము 1 వీరు

1 గురువులు

2 కడుపు 2 వారు

2 చదువుము

3 కుడి 3 ఆడుదమా

4 కాలు

1 ఇది నా ముఖము

2 అది నీ కడుపు

3 ఇది నా కుడి కాలు

4 వీరు మా గురువులు

5 వారు మా మామగారు

6 నీవు చదువుము

7 మనము ఆటలు ఆడుదమా ?

## ూ

1 మూతి 1 కూతురు 1 దూరము
2 పూవులు 2 ధూళి
3 భూమి

1 ఇది నా మూతి
2 నా భుజము మీద పూవులు కలవు
3 లీల మా గురువుగారి కూతురు
4 మా బడి చాల దూరము
5 నీవు ధూళిని తుడువుము
6 ఇది భూమి

## ె

1 మెడ 1 వలె 1 తెలుగు
2 చెవి 2 సెలవు
3 పెదవి 3 నాణెములు

1 ఇది నా మెడ
2 అది నీ చెవి
3 అది వాని పెదవి
4 వీరుని వలె నడువనా ?
5 మన భాష తెలుగు భాష
6 ఇవాళ మాబడికి సెలవు
7 ఈ రూపాయ నాణెములు నావి

## ే

1 దేహము 1 తేనె 1 దేశము
2 చేతులు 2 నేల
3 నేను 3 రేపు
4 పేరు
5 ఏమి
6 ఔను

1 ఇది నా దేహము
2 ఇవి నా చేతులు
3 నేను తేనెను తినుదును
4 నీ పేరు ఏమి ? రాముడా ?
5 ఔను నా పేరు రామారావు
6 నాది తెలుగు దేశము
7 మనము నేల మీద ఆడుకొనుదమా?
8 రేపు బుధవారమా ?

## ై

1 దైవము 1 రైలు
2 బైరాగి 2 పైరు
3 మైలు

1 దైవము మనను కాపాడును
2 నేను బైరాగి వేషమును వేయనా ?
3 మా ఊరికి రైలు చాల దూరము
4 మా వరిగె పైరు బాగుగా పెరిగినది
5 మా బడికి మైలు దూరమున దేవాలయము కలదు

## ొ

1 తొడ 1 పొడవు
2 నొసలు 2 కొడుకు
3 గొడుగు

1 నా తొడ లావుగా లేదు
2 నీ నొసలు విశాలము
3 మా నాయన పొడవు మనిషి
4 మా మామ కొడుకు నాకు బావ అగును
5 ఆయన గొడుగు ఖరీదు మూడు రూపాయలు

ో

1 నోరు  1 టోపి  1 రోజు
2 కోటు  2 సోమవారము
3 పోవుదును

1 నా నోరు చేదు అయినది
2 నా కోటు బిగుతు అయినది
3 బడి వదలగనే ఆడుకొనుటకు పోవుదును
4 మా రాముని తలపైన టోపి కలదు
5 ఈ రోజు పేరు ఏమి ?
6 ఈ రోజు సోమవారము

ౌ

1 చౌకగా  1 గౌరి  1 పౌరులము
2 మౌనము
3 నౌకరు

1 నేను గోలీలను చౌకగా కొనినాను
2 ఆమె పేరు గౌరి
3 మీరు మౌనముగ పాఠమును చదువుకొనుడు
4 మా నౌకరు ముసలివాడు
5 మనము తెలుగు దేశపు పౌరులము

ం

1 కంఠము  1 సుందరి  1 రెండు
2 అంగ  2 బంతులు
3 గంట

1 ఇది నా కంఠము
2 నీ అంగ పొడవు యెంత ?
3 మా పాప పేరు సుందరి
4 నాకు రెండు బంతులు కలవు
5 గంట వినబడగనే మేము బడికి పోవుదుము

ఒత్తులు

్క ఒత్తు

1 ముక్కు  1 అక్క  1 మొక్క
2 ఎక్కుదును  2 చక్కని
3 నమస్కారము

1 ఇది నా ముక్కు
2 నేను మా మేడను ఎక్కుదును
3 ఆమె మా అక్క
4 మా యింటిలో గులాబి మొక్క కలదు
5 దానికి చక్కని పూవులు పూయును
6 మా గురువుగారికి మేము నమస్కారము చేయుదుము

్గ ఒత్తు

1 బుగ్గ  1 ఉగ్గుపాలు
1 ముగ్గురు  2 మొగ్గ

1 ఇది నా కుడి బుగ్గ
2 మా పాపకు ఉదయమున ఉగ్గుపాలు పోయుదురు
3 వారు ముగ్గురు బాలురు
4 ఇదిగో, అందమైన పూవు మొగ్గ

్చ ఒత్తు

1 మచ్చ  1 కుర్చీ
2 వచ్చెదను
3 పచ్చడి  2 కూర్చుండువా

1 నా ముఖము మీద మచ్చ కనుపించును
2 బడి గంట వినబడగనే బడికి వచ్చెదను
3 నీవు కుర్చీలో కూర్చుందువా?
4 ఇవాళ మా యింటిలో పచ్చడి చేదు అయినది

జ ఒత్తు

1 బొజ్జ    1 మజ్జిగ
2 గజ్జెలు    3 గజ్జి

1 ఇదిగో, నా బొజ్జ
2 మా పాప కాలికి గజ్జెలు కలవు
3 నా చేతికి గజ్జి వచ్చినది
4 మా యింటిలోని మజ్జిగ తీయగా ఉండును

ట ఒత్తు

1 పొట్ట    1 బుట్టలు
2 బట్టలు    2 రొట్టెలు
3 గట్టిగా    3 పెట్టుదురు
4 కట్టుకొందును

1 ఇది నా పొట్ట
2 నేను మంచి బట్టలను కట్టుకొందును
3 నేను లాగును గట్టిగా బిగించి కట్టుకొనను
4 మా యింటిలో బుట్టలు చాల కలవు
5 ఆ బుట్టలలో రొట్టెలు పెట్టుదురు

డ ఒత్తు

1 గడ్డము    1 రోడ్డు
2 గుడ్డలు

1 ఇది నా గడ్డము
2 నేను మంచి గుడ్డలనే కట్టుకొందును
3 మా బడి రోడ్డుమీదనే కలదు

త ఒత్తు

1 పరుగెత్తి  1 అత్త
1 పుస్తకము
2 భక్తి

1 నేను బడినుంచి యింటికి పరుగెత్తి పోవుదును
2 ఆమె మా అత్త
3 మా అత్త భక్తితో దేవుని పూజ చేయును
4 ఇది నా పుస్తకము

ద ఒత్తు

1 ముద్ద  1 అద్దము  1 శబ్దము
2 పెద్ద

1 నేను మట్టి ముద్దతో వినాయకుని చేయుదును
2 నాకు కూడ ఒక అద్దము కలదు
3 మా యింటిలో మా అందరికి పెద్ద మా నాయన
4 మా బడిలో శబ్దము లేకుండ చదువుకొందుము

(సశేషము)

# హిందూదేశచరిత్ర - ప్రశ్నోత్తరములు

## ఐదవతరగతి



by

తాతా జగన్నాధరావు, హెడ్మాష్టరు. బోర్డు ఎలిమెంటరీస్కూలు, కొంర్యాం.
వేదుల అన్నయ్యశాస్త్రి, హెడ్మాష్టరు బోర్డు ఎలిమెంటరీస్కూలు, గురమ్మపాలెం.

(1942సం॥రం॥ మార్చినెల సంచికతరువాయి)

Syllabus Heading —The Muhammadan invasions —Ghazni and Ghori.

1. మహమ్మదీయులు మొదట ఎచ్చట నుండెడివారు?

జ: ఆఫ్గన్, బెలూచీ స్థానములలోను, మధ్యఆసియా మొదలగు ప్రదేశములయందు నివసించుచుండిరి.

2. వారుమనదేశముపైదండెత్తి వచ్చుటకు గల కారణమేమి?

జ: వారిదేశములో జనులు నానాటికివృద్ధిపొంది, తినుటకన్నముచాలకపోవుటచే ధనధాన్యములతో తులతూగుచున్నమన దేశముపై దండెత్తి వచ్చిరి.

3. సభక్తజన్ ఎవరు?

జ: అరబ్బులతర్వాత ఆఫ్గను దేశస్థుడగు సభక్తజన్ మన దేశముపై దండెత్తి పంజాబు నేలుచున్న జయపాలునోడించి కొంత ధనము తన దేశమునకు గొంపోయెను.

4. సభక్తజన్ తరువాత మనదేశముపై దండెత్తివచ్చిన మహమ్మదీయుడెవడు? వానికాపేరెట్లువచ్చెను?

జ: సభక్తజన్ తరువాత అతనికుమారుడగు, గజనీమహమ్మదు మన దేశముపై దండెత్తివచ్చెను. యితని రాజధాని గజనీ యగుటవలన యితనికి గజనీమహమ్మదుఅని పేరుగల్గెను.

5. గజనీ మనదేశముపై ఎన్నిసార్లు, యేయుద్దేశ్యముతోదండెత్తివచ్చెను? దండెత్తివచ్చినపుడొనర్చిన క్రూరకృత్యములేమి?

జ: ఇతడు మనదేశమందలి ధనరాసులను దోచుకొనుటకును, హిందువులను మహమ్మదీయులుగా నొనర్చుటకును 17సార్లు మనదేశముపై దండెత్తివచ్చెను. ఇతడు వచ్చునపుడెల్ల పట్నములను, పల్లెలనుకాల్చివేసి, దేవాలయములను పగులగొట్టి, విగ్రహములనుముక్కలుచేసి, వందలకొలది హిందువులనుజంపి, బంగారము రత్నములను దోచుకొనిపోయెను. బలవంతముగా అనేకమందిని మహమ్మదీయ మతములోకలిపెను.

6. మహమ్మదుగజనీ యొక్క కడపటి దండయాత్రయేది? దానిఫలితమేమి?

జ: గుజరాతురాజ్యములో సముద్రపుటొడ్డునయున్న సోమనాధదేవాలయపు ముట్టడియే కడపటిది. యీదేవాలయమును కాపాడుటకై అనేకమందిరాజులు గజనీని ఎదుర్కొనినను, గజనీవారిని తుదకోడించి, సోమనాధుని విగ్రహమును బ్రద్దలుచేసి ఆలయములోని ధనరాసులనుదోచుకొనిపోయెను.

7. మహమ్మదు గోరీ ఏవంశమువాడు? గజనీ తరువాత ఎన్నిసంవత్సరములకు వీరు అఫ్‌గన్ స్థానమాక్రమించుకొనిరి?

జ: మహమ్మద్‌గోరీ, గోరీవంశమువాడు. గజనీ తరువాత 200 సంవత్సరములకు వీరు అఫ్‌గన్‌స్థానము ఆక్రమించుకొనిరి.

8. గోరీ ఏ యుద్దేశముతో నెన్నిసార్లు మనదేశముపై దండెత్తెను? ఎవరిచే నోడింపఁబడెను?

జ: గోరీ మనదేశముపై ¯ సార్లు, రాజ్యమును స్థాపింపదలచి దండెత్తి ఢిల్లీ ఆజ్మీరుల నేలుచున్న పృధ్వీరాజుచే నోడింపబడెను.

9. జయచంద్రుడెవరు? ఎవరి సహాయమున పృధ్వీరాజు నెదిర్చెను? దాని ఫలితమేమి?

జ: జయచంద్రుడు కనోజిరాజు. మహమ్మద్‌గోరీ సహాయమున పృధ్వీరాజు నెదిర్చెను. మహమ్మదీయులచే జిక్కి పృధ్వీరాజు చంపబడెను. ఢిల్లీ, ఆజ్మీరు రాజ్యములు గోరీ వశమయ్యెను. గోరీ పిమ్మట జయచంద్రునోడించి కనోజిరాజ్యమును జయించెను. జయచంద్రుడు తన తెలివితక్కువకు చింతించి ఆత్మహత్యచేసికొనెను.

Syllbus Heading:—The three Acharyas.

1. త్రిమతాచార్యు లెవరు? వారి జన్మస్థానములు, స్థాపించిన మతములు, రచించిన గ్రంథములను పేర్కొనుము?

జ: శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు.

1. శంకరాచార్యులు:— తిరువాన్కూరు జిల్లాలోని కాలదిగ్రామమున జన్మించెను. అద్వైతమతమును స్థాపించెను. భగవద్గీత, ఉపనిషత్తులకు వ్యాఖ్యానము, భజగోవిందమాలను రచించెను.

2. రామానుజాచార్యులు:— కాంచీపురసమీపమందలి శ్రీ భూతపురిలో జన్మించెను. విశిష్టాద్వైతమతమును స్థాపించెను. భాష్యములు వ్రాసెను.

3. మధ్వాచార్యులు:—కన్నడదేశమున ఉడిపియను గ్రామమున జన్మించెను. ద్వైతమతమును స్థాపించెను.

(సశేషం.)

# వత్సలామోదము

(పసుపులేటి రామకోటయ్య)

నా అనుభవ జీవితములో చూచి ఆనందించి నను గొన్న విషయాలను యితరులకు విప్పి చెప్పాలని నాకు చాలయిష్టము. అది మంచిదను కోండి లేక చెడ్డదను కోండి కాని నాకు అది అలవాటుగా అయిపోయింది మొదటినుండి అదేమిటంటారేమో మీకిప్పుడే వివరించాలని కోరిక కలిగింది నాకు. అదొక చిన్నవిషయమే

నేను పుట్టింది పెరిగింది చదువుకొన్నది పట్టణాలు కావడమువల్ల నాకు పల్లెటూరిజీవితమంటే యేమిటో బొత్తిగా తెలిసేదే కాదు. నేను స్కూలు ఫైనలు వరకు చదివాను లెండి. భగవంతునికి మొక్కుబడి ముడుపు చెల్లించినట్లు చదువుమానేసాను, పెద్ద వాళ్ళు జరుపుతూ యుండే వ్యాపారాన్ని నేర్చుకొని సాగించటానికి పన్నెండేండ్ల ప్రాయముగల పిన్నవాణ్ణి కావటము, పెద్దవాళ్లు గతించడము, నాకు చాలాచిక్కు సమస్యే అయింది. కథ వెనుకకు మరలింది. మరచాను నేను నేను చదువు మానేసేటప్పటికి పదునెనిమిది వత్సరాలలో పడ్డాను.

వెంటనే నేనొక మిత్రుని సహాయముతో స్కూలు మాష్టరు వుద్యోగము సంపాదించాను యెక్కువ శ్రమపడకుండాను. అదొక పల్లెటూరు చిన్న అగ్రహారముకూడాను. నాకున్న అప్పటి పరిస్థితులు ముందుకు నన్ను నడిపిస్తున్నవిగాని నాలోయున్న విచారము, భయము, కలిసి నేనొక పల్లెటూరు పోవాల్సి వచ్చిందని వెనుకకు నన్ను లాగేస్తున్నాయి. అంటే నేను నాచిన్నతనమునుండి యెక్కువగారాబముతో పెరగడము చేతనున్నూ, క్రొత్తగా అదికూడ-నొక పల్లెటూరు వెళ్లాల్సి వచ్చినందుకున్నూ, కొంత బిడియ పడవలసి వచ్చింది. కాని భగవంతుని మీద భారము వేశాను. బయల్దేరాను ఆపల్లెటూరికి రైలుదిగాను. ఆవూరు రైలుస్టేషనును ఒకమైలున్నర దూరంలో వుంది దారితెలిసికొని బాటసారుల ద్వారా ఆవూరుచేరాను

అదివరకే పిల్లలలో అనుకొంటూవున్నారు గాబోలు క్రొత్త పంతులుగారు వస్తారని, నన్ను చూడగానే ఒక బాటసారి (నావెంటవస్తూ) ఆయూరిలో ప్రవేశించగానే యెవరోయొక కుర్రవానికి చెప్పేసరికి వాడు, వాడివెంబడికి పోతూన్న చిన్నపిల్లలు, పరుగెత్తారు-హెడ్మాష్టరు గారికి నావిషయము చెప్పను ఒక కుర్రవాడు మాత్రము నన్ను వదలక పాఠశాలవరకు నన్ను నడిపించాడు. ఆంజనేయులు శ్రీరామ లక్ష్మణులను సుగ్రీవుడుండు పర్వతమునకు నడిపించినట్లు.

ప్రధానోపాధ్యాయులు చాలమంచివారు గాన నన్నాహ్వానించారు ఆసీనులు కమ్మని ఒక కుర్చీ చూపించారు. ఆయన క్రైస్తవుడు. ఆవూరు అగ్రహారము, అనగా జమీందారీ వూరన్నమాట. అయినా పంతులు గారంటే ప్రతివానికిని అభిమానంవున్నది ఆవూళ్లో-జమీందారి మొదలు చిన్న రైతు వరకు సాధారణముగా అది పంతులుగారి నడవడి మీద మెలకువ మీద, ఆధారపడి, వుంటుంది. 7 గంటలనుండి 10 గంటవరకు బడి సాగింది. అది మిషన్ స్కూలు అని పేరేగాని దానిలో వున్న పిల్లలందరు హిందువుల పిల్లలే. క్రైస్తవుల పిలలు వన్నెండుమంది మాత్రమే యున్నారు. బస్తీలలో కలుగని పొత్తు హిందూవులకు క్రైస్తవులకు ఆచిన్నవూళ్లో యెట్లా కలిగిందా అని నాకు ఆశ్చర్యమేసింది? నిజం చెప్పొద్దూ. జమీందారివారి పిల్లలనే బడికి పంపేవాళ్లు అలాంటప్పుడు తక్కిన రైతులలో అలజడి యేముంటుంది చెప్పండి? సాయంత్రము 3 గంటలనుండి 5 గంటల వరకు బడిపాఠములు, తర్వాత ఆటలు మగపిల్లలకు - ఆటలు, పాటలు, ఆడపిల్లలకు, నేను రెండవ తరగతికి పాఠాలు చెప్పుతూయుండేవాణ్ణి. అడపా దడపా మూడు నాలుగు తరగతులకుకూడ పాఠాలు చెప్పేవాణ్ణి ప్రధానోపాధ్యాయుడు లేనప్పుడు సాయంత్రమందు నేనే డ్రిల్లుమాష్టరుపదవి నాక్రమించి పిల్లలను ఆటలు ఆడించేవాణ్ణి. 5 యేండ్ల పిల్లలు మొదలు పదేండ్ల పిల్లలవరకు యుండేవాళ్లు వాళ్లతో తిరుగుతూ పాఠాలందు, ఆటలందు, తోటపనులయందు, చిఱుతప్రాయము గల బాలురకు నుత్సాహము పుట్టించడం నాకొక నూతన శోభగా యుండేదిఅప్పుడు. పిల్లలచేత చిన్నతోట

వేయించటానికి పాఠశాలముందే ఒక ప్రక్కన చిన్న చిన్న మొక్కలు, విత్తనములను నాటించాము శృంగారము ఒలికేటట్లు

పిల్లలు పెద్దవారినిచూచి వారి పనిపాటలను అనుకరించేవారు. వారిచేత యెంత గొప్పపనియైనను చేయించవచ్చుమంచి పద్ధతులతో. డ్రిల్లు క్లాసులో డ్రిల్లు చేసినతర్వాత వారికి కొన్ని నీతులను బోధించే చిన్న చిన్న పిట్టకథలను, జంతువుల నామములు, చెప్పివారి మనస్సులు రంజింపజేసేవాణ్ణి. చిన్న పిల్లలను ఒకేవిధముగా గంటలాదిగా కూర్చుండబెట్టి పాఠములు చదివించఁగూడదు. అట్లా కూర్చుండబెట్టితిమా ఒక అరగంటలో పదమంది పిల్లలు లేచేవాళ్లు - ఒంటేలు సార్ - రెండేళ్లు సార్ అని ప్రతి రోజు బడికి వచ్చేటప్పుడు ప్రతిపిల్లవానిని తోటలోనికి ఒక్కొక్క రకానికి కొన్నివిత్తనాలు తెమ్మని చెప్పేవాణ్ణి. అట్లా నాల్గురోజులలో వరుసగా పిల్లలందఱును కలిసి ఒక చిన్నబుట్టెడు ప్రోగుచేసారు బడిలో తోటను వేయుటకు అన్ని పరికరాలను తెచ్చి మట్టు చిల్లకంచెనాటి 15 రోజులలో పెద్దతోటగా తయారుచేసారు పిల్లలు కన్నుల పండువుగా. అప్పట్లో నేను అవివాహితుడనుగాని లేకపోయిన రోజూ ఆతోటలోని కూరగాయలనే యింటికిపంపే వాణ్ణి వేరేకొనకుండా

అడి పల్లెటూరు కావడముచేత బడికిరాని పిల్లల్ని అప్పుడప్పుడు పిలవవలసి వచ్చేది. షికారుగా వెళ్లినట్లు నూరాము వేసి బడికిరాని విద్యార్థులను పిలుచుకొని వచ్చుటకు వెళ్లే వాళ్లము నేను హెడ్మాష్టరు కూడాను. ఒకరోజు ఒకరైతు యింటికి వెళ్లేసరికి పిల్లవాడు నన్ను చూచిపరుగెత్తాడు యింట్లోకి. ఆకుర్రవాని తల్లిదండ్రులు వానిని చాల ప్రేమతోను, గారాబముతోనూ చూస్తూండేవాళ్లు మీ అబ్బాయిని బయటికి పంపండి అన్నాను వాని తలిదండ్రులతో. వాళ్లకు తెలియకుండగా ఆ పిల్లాడు బానల దొంతరల వెనుక దాగాడు. అది వాని తల్లి దండ్రులకు తెలియక "యింట్లోనికి రాలేదు మాఅబ్బాయి అని చెప్పారు ధైర్యముతో. కాని నేను వారిమాటలను నమ్మక యింట్లోనికి వెళ్లాను. అపిల్లవానిపేరు వెంకయ్య వాణ్ణి పిలిచాను కేకవేసి చీకటిలో వెతుకతూను. నాపిలుపువినగానే బావురంటూ యేడ్వడము మొదలెట్టాడుకొట్టినట్లుగా ఆయిల్లు ఒక చీకటికొన యనవచ్చు. గుత్తికొండ బెళాన్ని పోలి వుంటుంది. దీపము ముట్టించమని చెప్పాను వాళ్లతో. వాళ్లను అనాగరికులే యని చెప్పవచ్చు. పెద్దకాగడామామిరి మండుతూవున్న పొడుగాటి పేడుఒకటి పట్టుకొని వచ్చింది వాళ్లమ్మ నాసమీపానికి. నిజం చెప్పొద్దూ ఆమెనుచూచేసరికి నాకుచాల భయంవేసింది. యింట్లో యెందుకొచ్చావు అనిఅడుగుతుందేమో ఆమె. కాని ఆ తల్లి తాను తెచ్చిన కొఱవితో నొక చిన్న కిరసనాయిలు దీపాన్ని ముట్టించి చేతితో చూపించింది పిల్లాణ్ణి నన్నుచూచి ఆవిద్యార్థివాళ్లింట్లో నున్న దొంతర్లమధ్య పరుగులు పెట్టుతూన్నాడు రోదనము చేస్తూను నేను వానిని సమీపించేసరికి వాడు ఒక దొంతరను గట్టిగా కౌగలించుకున్నాడు. మూరాము చేస్తూ. నాకు నాలోనే కోపము, ఆశ్చర్యము, కిలిగి నవ్వుగా పరిణమించబోయింది కాని రాని కోపాన్ని రప్పించుకొని వానిచేయిపట్టుకొన్నాను కాని వాడు రాలేదుమూర్ఖపు పట్టుతో. నేను విసిగి వానిని కొట్టుట ధర్మముగాదని వానిని తర్వాత బుజ్జగించి పంపమని పాఠశాలకు వచ్చాము. కాని ఒకగంటలో ఆకుర్రవాని తండ్రి వానిని పలకతో బడికి పిలుచుకొనివచ్చాడు. కాని ఆరోజున ఒకపాఠము నేర్చుకొన్నాను. అదేమిటంటే మూర్ఖులను ముట్టరాదని. వారి పిచ్చికుదిరేంతవరకు ఒక చిన్న పిల్లవాడుమాత్రము 5 ఏండ్లప్రాయము వాడు రోజూ ఉదయమున పెందలకడనే బడికి అందరికంటె ముందుగావచ్చికూర్చుంటాడు. శ్రద్ధగా చదువుకుండేవాడు చిన్నవాడైనా. మంచి పిల్లలకు పుట్టుకతోనే మంచి అలవాట్లు కలుగగలవని నాఅభిప్రాయము

కాన ఉపాధ్యాయులు పిల్లలయొక్క విద్యాబుద్ధుల ననుసరించి విద్య నభ్యసింపజేయు గలందులకు గోరుచున్నాను.

---

# ఉపాధ్యాయులు - జ్ఞాపకమునందుంచుకొనవలసిన ముఖ్య విషయములు

(రావెల వెంకటసుబ్బారావు, హెడ్మాష్టరు రావెల)

1. స్కూలుమేనేజరునకు అప్పులున్నచో ఆ అప్పులవాండ్లు ఎడ్యుకేషనల్ టీచింగుగ్రాంటును జప్తుచేయించరాదని న్యాయస్థానములో తీర్పునొసంగిరి.

2. ప్రతినెల నెలసరిలెఖను మరుసటినెల 5 వ తేదీలోపుగా పంపుట.

3. ఒకనెలలో క్రొత్తటీచర్లు చేరినపక్షమున ఆటీచర్ల సర్టిఫికెట్లను రెండు కాపీలుగా తయారుచేసి వాటిపై పరీక్షాధికారిచే సర్టిఫై చేయించుకొని ఒక కాపీస్కూలులో యుంచుకొని రెండవకాపీని ఆయా నెల నెలసరిలెఖతో చేర్చిపంపుట.

మరియు

సర్వీసు రిజష్టరు ఖరీదు రు 0-8-0 తాలూకా సబ్ ట్రజరీలో చెల్లించి రిజష్టరు కొరకు దరఖాస్తు దాఖలుచేయించుట.

యీపై రెండుపనులు టీచరును సర్వీసులో చేర్చుకొనకపూర్వమే నెరవేర్చుకొనునట్లు చూచుకొనుట.

4. క్యాజుయల్ లీవుకాని, ఇతరసెలవులుపొందునపుడుగాని, ముందుగా మేనేజరుగారిద్వారా పరీక్షాధికారికి రిపోర్టుపంపుకొనుట. సిక్ లీవు అయినయెడల మెడికల్ సర్టిఫికెట్టును ఆయా నెలసరిలెఖతో జతపర్చిపంపుట.

5. సెలవులకు ముందుగను, దీర్ఘకాలపు సెలవులకుముందుగను, బడిలో క్రొత్తటీచర్లను నియమించుకొనరాదు.

6. రికార్డుషీట్లను అడ్మిషన్ నెంబర్ల వరుసను వ్రాయుట - అడ్మిషను తేది - ఆయా తరగతులలో చేరిన లేక ప్రమోషను అయిన తేదీలను గుర్తించవలెను.

7. ఇతరస్కూళ్ళనుండి వచ్చిన విద్యార్థులకు ఆస్కూలు రికార్డుషీటునుబట్టి ప్రతి తరగతి వివరములు తమస్కూలు రికార్డుషీటులో నమోదుచేసుకొనవలెను.

8. ఖాయపుటీచర్లు, సంవత్సరము అంతములోపనిచేయుటకు యేర్పాటు కాబడిన టీచర్లుమాత్రమే క్యాజుయల్ లీవుకాని ఇతర సెలవులకు అర్హులు.

9. నెలసరిలెఖలలో స్కూలులో పనిచేయుచున్న ఉపాధ్యాయుల సర్వీసు రిజష్టరు నెంబర్లు - పుట్టిన తేదీలను - ఆ యా టీచర్ల పేర్ల క్రిందుగా నమోదుచేయుట.

10. ఒకేతరగతిలో విద్యార్థి ఒకసంవత్సరముకంటె మించియుండరాదు.

11. ప్రతి అర్థసంవత్సరములోను పైతరగతికి అర్హులైనవారినే ప్రమోషన్ చేయుట.

12. టీచరు అట్టెండెన్సు రిజిష్టరులో ఉపాధ్యాయుడు స్కూలునకు హాజరైన టైమును నోటుచేసి ఇనిషియలు పెట్టుట.

13. పాఠశాలలోపలి భాగమందు ఒక ప్రాముఖ్యమైన స్థానములో ఇన్ఫర్మేషను బోర్డునుంచుట.

(1) పాఠశాలపేరు, (2) మేనేజరు లేక కరస్పాండెంటుపేరు, (3) రికగ్నైజు కాబడిన తరగతులు, (4) రికగ్నైజుకాని తరగతులు, (5) ఉపాధ్యాయుల సంఖ్య, (6) రిజిష్టరులోని విద్యార్థులసంఖ్య, బాలురు బాలికలు మొత్తం (7) పాఠశాలలోని స్థానములసంఖ్య, (8) నిత్యము పనిచేయు గంటలు, (9) వారపు వారీ సెలవులు, (10) (a) గ్రామములో బడియీడుగల పిల్లలసంఖ్య, (b) బడులలో చదువుచున్నవారి సంఖ్య.

14. ప్రతినెలకు క్లాసువారీగా అట్టెండెన్సు చార్టును ప్రదర్శించుచుండవలెను.

15. పాఠశాలలో పాఠ్యప్రబోధమునకు ఉపయోగకరముగాను, చూచుటకు అందముగాను, ఉండు పటములు మాత్రమేయుంచుట.

16. ప్రతి పాఠశాలలో ఒక జిగురుబుడ్డి, కత్తెర,ఒకరికార్డుపెట్టె, గడియారము, నీళ్లు తోడు బకెట్టు, పారలు, పలుగు, లిక్కి, తోటకత్తి ఉండుటముఖ్యము.

17. విద్యార్థుల మంచినీటికొరకు ఉంచు కూజా పెద్దదిగాయుండి దానికి పంపు అమర్చియుంచుట ఆరోగ్యకరము. (సిమెంటుతో చేయబడినదిగా యుంచుము) మూడు కడవలనీళ్లుపట్టునదిగా(ఒక్కొక్కటి) యుంచుము. పిల్లలసంఖ్యనుబట్టి ఎన్ని అవసరమో అన్నిటిని యుంచవలెను.

18. యీక్రింది నమూనాలో క్యాజుయల్ లీవు, యితరలీవుల, రిజిష్టర్లునుంచుట.

| అప్లికేషను తారీఖు | సెలవు పీరీడ్ తేదీ నుండి | తేదీ వరకు | దినముల సంఖ్య | సెలవునకు కారణములు | సెలవుపెట్టు ఉపాధ్యాయుని సంతకము | హెడ్మాష్టరు ఇనిషియల్సు | రిమార్కు |
|---|---|---|---|---|---|---|---|

19. ప్రతి నెలసరిలెఖలలో జనాభా స్టేటుమెంటును గుర్తించుట.

20. బాలికలను ఎక్కువగా చేర్చుకొనుట.

21. సెంటరుక్లాసు మీటింగులకు తప్పనిసరిగా హాజరగుట.

(మిగిలినవి వచ్చేసంచికలో)

# ఋతువులు - వానిధర్మములు

(రావెలవెంకటసుబ్బారావు, హెడ్మాష్టరు, రావెల)

"రఘుకులభూషణా । రామా" మాదిరి

ఋతువులరయనారురా । కుమారా ॥ ఋతువు॥
క్షితితలమునఁగనప్రతివత్సరమున
హితవుకొరకు దేవునిదయవలన॥
సతతమునడచునురా । తమతమ । గతులనుదప్పవురా । కుమారా॥
వింతగఁజైత్ర వైశాఖములవనివ 1
సంతఋతువనఁబరగి వృక్షచయ
మంతయుఁజిగురించురా । సుమములు । వింతయగను బూయురా-కుమారా॥ఋ
గ్రీష్మఋతువగుచు జ్యేష్ఠాషాఢముల్ 2
భీష్మముగాఁ బశ్చిమవాయువులు
వీచుచు వడగొట్టురా । ఎండవిశేషముగాఁగాయురా । కుమారా।
వర్షఋతువు శ్రావణభాద్రపదాల్ 3
వర్షించుచు కర్షకసంఘములకు
హర్షముచేకూర్చురా । కుమారా । కష్టములిల బాయురా।ధరణిపై ॥ ఋ॥
ధరణి నాశ్వయుజకార్తికములు। 4
అరయ శరదృతువనఁబరగురా।
బురదయింకుగదరా । శశికాంతులుతీర్చి కాయుగదరా । కుమారా ॥ ఋ॥
మార్గశీర్ష పుష్యమాసములుహే 5
మంతఋతువనఁబరగి సదాభువి ।
నిర్గమమగుహిమము । చలింపగఁజేయుచల్లదనము । సౌఖ్యము ॥
ధరశిశిరము మాఘఫాల్గుణములై 6
తరులతాది పత్రములిలరాలున్
ధరనెండలుముదురున్ ॥ ఆర్. వి. యస్. । భళిరాయనుచుండన్। కుమారా
॥ఋతువు॥

# వృక్ష వైచిత్ర్యము

[పి. నారాయణయ్య — మేర్లపాక.]

1. లేతగుమ్మడికాయ చెట్టుననుండగా తొలిచి అందులో వంగగింజలుపోసి రంధ్రమును గప్పుము. గుమ్మడిపండు పండిన వెనుక నాగింజలను తీసి యెండబెట్టుము. ఋతుకాలమున నాగింజలను మొలపించుము. గుమ్మడియాకులును లతయు బయలుదేరి వంకాయలు కాచును. ఇది యద్భుతము.

2. ఏదైన నొక రంగులో బీజము లనేకమార్లుతడపి, ఆబీజములను మొలపించిన రంగు నీళ్లే పోయుచుండిన యెడల చెట్టుయొక్క కొమలదశయందు ఆరంగు పుష్పములే పూచును.

3. కొంచెము తెల్లనైన పత్రపుష్పములుగల వృక్షలతాదికములు, ఊడుగ తైలముచే లేపితమైన యెడల ఎఱ్ఱటిపూలు పూచును.

4 పద్మబీజచూర్ణము ఊడుగ తైలములో నానబెట్టి జలమందుంచిన తక్షణమే పద్మలత పుట్టును.

5. జలమునందును, నేలయందును, బుట్టు అన్ని విత్తనములును ఊడుగతైలము నందు నానబెట్టిపాతిన ఆయా పుష్పములను తత్కాలమునందే ఫలించును.

6. యవలు, తిలలు, పసుపాకులచేతను వేయబడిన మూలముకలదియై వాటి నీళ్ళచేత తడపబడిన ప్రత్తిచెట్టు ప్రజ్వరిల్లుచున్న యగ్ని వంటి దూదిని బుట్టించును.

7. బూరుగచెక్క, పసపు, నీలి, కరక, తాడి, ఉసిరిక, చంగల్వాకోష్టు, మద్యమును, గలిపి లేపనమొనర్చినయెడల చిలుక రెక్కవంటి దూదియగును.

8 యవలు, తిలలు, మంజిష్ఠ, మనస్సిల, ఆవు, గొఱ్ఱె, మేక, వీటిపాలు, చింత, జీవంత వీటియాకులు కలపి నీరు పోయుచుండిన యెడల అంతరిక్షచ్ఛాయగల దూది పుట్టును. (మి. ఈ)

---

# హిందూదేశ చరిత్రము

## (4 వ తరగతి - ప్రశ్నోత్తరములు)



1942 సం॥ రం॥ మార్చి నెల సంచిక తరువాయి

By

కాతా జగన్నాధరావు, హెడ్మాష్టరు. బోర్డు ఎలిమెంటరీ స్కూలు, కొంత్యాం
వేదుల అన్నయ్యశాస్త్రి, హెడ్మాష్టరు, బోర్డు ఎలిమెంటరీ స్కూలు, గురమ్మపాలెం

3. అశోకుని కళింగయుద్ధమునుగూర్చి క్లుప్తముగా వ్రాయుము ?

జ:—కళింగరాజ్యము మహానది, గోదావరీ నదుల నడుమునున్నది. అశోకుడు

కళింగరాజుతో ౩ సంవత్సరములు యుద్ధముచేసి తుదకు జయమొందెను. యుద్ధములో శత్రువు లనేకులు మరణించిరి. అనేకులు గాయములచే బాధపడుచుండిరి. వారి దుర వస్థకు తానే కారకుడని అశోకుడు తలంచి నాటినుండి యుద్ధములు చేయనని శపథము పట్టెను. జీవహింస తనరాజ్యములో మాన్పించెను.

4. అశోకుడు స్వీకరించిన మతమేది ? ఆ మతధర్మముల నెట్లు వ్యాప్తిచేసెను?

జః—అశోకుడు బౌద్ధమతమును స్వీకరించెను. అంతటినుండి తాను వేటాడుట, మాంసము తినుట మానివేసెను. తన రాజ్యమున జంతుహింసను మాన్పించెను. బౌద్ధ మతధర్మములను ప్రజలకు బోధింపజేసెను. మతసార వాక్యములను రాతి స్తంభములపై చెక్కించి తన రాజ్యమున అచ్చటచ్చట పాతించెను. బౌద్ధ సన్యాసులను సింహళము, చీనా మొదలగు నితర దేశములకంపి బౌద్ధమతమును వ్యాపింపచేసెను.

5. అశోకుని రాజ్యపరిపాలన మెట్లుండెడిది ?

జః—యితడు ప్రాణికోటియెడల మిగుల దయగలిగి వర్తించుచుండెను. పశువులకొరకీతడు వైద్యశాలలు స్థాపించెను. ప్రజల క్షేమమునకై మంచి బాటల నేర్పరచి, సత్రములు కట్టించి, చెరువులను, నూతులను త్రవ్వించెను.

6. ఇతని రాజ్య మెచ్చటనుండి యెంతవరకు వ్యాపించియుండెను ?

జః—ఇతనిరాజ్యము కాబూలు మొదలు బంగాళాఖాతము వరకును, దక్షిణమున పాలారు నదివరకును వ్యాపించెను.

7. అశోకుని అంత్యదశను గూర్చి క్లుప్తముగా వర్ణించుము ?

జః—అశోకునకు ముసలితనమున విచారములు వృద్ధియైనవి. తన భార్యయగు అసంధిమిత్ర మరణానంతరమున, తిష్యరక్షితయను చిన్నపిల్లను అశోకుడు వివాహ మాడెను. యీమె తన ముసలిభర్తను జూచి అసహ్యపడుచుండెనట. యీ విచారము వలన అశోకునకు వృద్ధాప్యమున సౌఖ్యము లేకపోయెను.

Syllabus Heading:—Explanation of the meaning of B. C and A. D.

1. బి. సి; ఎ. డి; ల అర్థమును విశదీకరింపుము ?

జః—క్రీస్తునకు పూర్వము జరిగిన విషయముల యొక్క కాలమును తెలియ చేయునది బి. సి. అనగా క్రీస్తునకు పూర్వమని అర్థము. క్రీస్తునకు తర్వాతకాలమును తెలియచేయునది ఎ. డి. క్రీస్తునకు పూర్వము జరిగిన సంవత్సరముల సంఖ్యలు హెచ్చు నుండి తగ్గుచుండును. అనగా అశోకుడు క్రీ. పూ. 262 నుండి 232 వరకు రాజ్య మేలెనని వ్రాయుదురు. ఇప్పటికి క్రీ. శ. 1940 సంవత్సరములు గడచెను.

Syllabus Heading:—Talks on the "golden age of the Guptas"—
Vikramaditya and the nine gems.

1. స్వర్ణయుగ మనగానేమి ?

జః—స్వర్ణయుగమనగా సువర్ణము (బంగారము) తో సరిసమానమగు కాలమని యర్థము. యీకాలమున మనదేశప్రజలు సకలభోగభాగ్యములు గలిగి సౌఖ్యము లను

భవించిరి. యీయుగమునసే క్షీణదశయందున్న హిందూమతము, సంస్కృతభాషయు గుప్తరాజులవలన ఉన్నతస్థితికి తేబడెను.

2. సముద్రగుప్తునిగూర్చి క్లుప్తముగా వ్రాయుము.

జః—చంద్రగుప్తుని కుమారుడు సముద్రగుప్తుడు. యితడు ఉత్తర హిందూస్థానమును జయించి, పిమ్మట దక్షిణహిందూస్థానమందలి కళింగ, ఆంధ్ర, కోసల, మహారాష్ట్రరాజులను జయించి, దిగ్విజయసూచకముగా అశ్వమేధయాగ మొనర్చెను. యితడు గొప్ప విద్వాంసుడు. సంగీతప్రియుడు. యితడు క్రీ. వె. 326 నుంచి 375 వరకు రాజ్యమేలెను.

3. చంద్రగుప్త విక్రమాదిత్యు డెవరు? యితనికి విక్రమాదిత్యుడను బిరుదెట్లు గల్గెను?

జః—ఇతడు సముద్రగుప్తుని కుమారుడు. అనేక శత్రువులను జయించుటచేతను, ఆదిత్యుని వంటి అనగా సూర్యుని పరాక్రమము గలవాడగుటచేతను యితనికి విక్రమాదిత్యుడను బిరుదుగల్గెను.

4. విక్రమాదిత్యుని కాలమున గుప్తరాజ్యమెంత వరకు వ్యాపించెను? రాజధానియేది?

జః—విక్రమాదిత్యుని కాలమున గుప్తరాజ్యము ఉత్తరమున హిమాలయముల మొదలు దక్షిణమున నర్మదానది వరకును, తూర్పుపడమరలబంగాళాఖాతము మొదలు అరేబియా సముద్రమువరకును వ్యాపించియుండెను. రాజ్యము విశాలమైనందున పాటలీపుత్రమునకు దోడు ఉజ్జయినీ నగరమును రెండవరాజధానిగా చేసెను.

5. చంద్రగుప్త విక్రమాదిత్యుని స్వభావమెట్టిది?

జః—ఇతడు న్యాయబుద్ధి గలవాడు. దైవభక్తి గలవాడు. రాజునను గర్వము విడచి నిరాడంబర జీవితమును గడపువాడు. ప్రజల కష్టసుఖములను, మారువేషమున రాజ్యమునతిరిగి, స్వయముగా కనుగొనుట యందాసక్తిమెండు. హిందూ మతాభివృద్ధికై పాటుపడెను. ప్రజలను కన్నబిడ్డలవలె రక్షించువాడు. గొప్పవిద్యాభిమాని.

6. నవరత్నము లననేమి?

జః విక్రమాదిత్యుని ఆస్థానమున కాళిదాసు, ధన్వంతరి, క్షపణకుడు, శంకుడు, వేతాలభట్టు, ఘటకర్పరుడు, వరాహమిహిరుడు, వరరుచి, అమరసింహుడు అను తొమ్మండుగురు పండితులు గలరు. వీరొక్కొక్కరొక్కొక్క శాస్త్రమునందు ప్రజ్ఞ గలవారై యుండిరి. వీరికే నవరత్నము లనిపేరు.

Syllabus Heading:—Harshavardhana and his Empire.

1. హర్షవర్ధను డెవరు?

జః—హర్షుడు స్థానేశ్వరరాజగు ప్రభాకరవర్ధనుని రెండవ కుమారుడు. ఇతడుత్తర హిందూస్థానములోని హిందూ చక్రవర్తులలో కడపటివాడు.

2. రాజ్యవర్ధనుడెవరు? ఇతని మరణమెట్లు తటస్థించెను?

జ:—రాజ్యవర్ధనుడు హర్షుని అన్న. వీరి సోదరియగు రాజ్యశ్రీ కన్యాకుబ్జము నకు రాజైన గృహవర్మను వివాహమాడెను. మాళవదేశపు రాజు గృహవర్మను మాయోపాయముచే జంపించి రాజ్యశ్రీని చెరలో నుంచెను. సోదరిని విడిపించుటకై రాజ్యవర్ధనుడు మాళవరాజుపై దండెత్తి అతనిని సంహరించెను. కాని మాళవరాజు స్నేహితు లితనిని మోసగించి తుదకు చంపించిరి.

3. హర్షవర్ధనుడెట్లు, యే సంవత్సరమున రాజయ్యెను?

జ:—రాజ్యవర్ధనుని మరణము వలన దేశములో రాజులేక అశాంతి ప్రబలెను. అప్పుడు మంత్రులందరును 16 సంవత్సరముల ప్రాయముగల హర్షుని క్రీ. శె. 606 లో రాజుగా చేసిరి.

4. హర్షుడు తనరాజ్యమెట్లు, ఎంతవరకు వ్యాపింపజేసెను? రాజధాని యేది?

జ:—హర్షుడు మాళవ, బంగాళరాజులను జయించి వారి రాజ్యములు తనరాజ్య ములోగలుపుకొనెను. ఉత్తరహిందూస్థానమంతయు పంజాబు వరకు జయించెను. దక్షిణ హిందూస్థానమును జయించు తలంపుతో దక్షిణ హిందూస్థానముపై దండెత్తెను. గాని చాళుక్యరాజగు పులికేశిచే ఓడింపబడి, అంతటినుండి రాజ్యవ్యాప్తిని విరమించి, తనకు గల రాజ్యముతో తృప్తినొందెను. కన్యాకుబ్జమును రాజధానిగా చేసికొనెను.

5. హర్షుని రాజ్యపాలన మెట్లుండెడిది?

జ:—హర్ష చక్రవర్తి మహావిద్వాంసుడు. అనేకవిద్వాంసులను పోషించెను. హిందూ, బౌద్ధమతములను సమదృష్టితో చూచెను. యితడు ధర్మమూర్తి యని పేరొందెను. అయిదు సంవత్సరముల కొకసారి ప్రయాగలో గొప్పసభను జరిపి తన ఖజానాలోని ధనమంతయు ప్రజలకు దానము చేసెడివాడు. యితేడు దినమును మూడు భాగములుచేసి ఒకభాగములో రాజ్యపాలనముచేయుచు, మిగిలిన రెండు భాగము లలో మతవిషయములను చర్చించుచుండెడివాడు. ప్రజ లితనికాలమున పాపభీతిగలిగి ధర్మబుద్ధిగలవారై యుండిరి. యితనికి డంబము లేదు. యితనికాలమున విద్య బాగుగా నభివృద్ధిచెందెను.

6. హర్షు డేసంవత్సరమున మృతినొందెను? యితని అనంతరమున హర్ష సామ్రాజ్యమెట్టి స్థితికి వచ్చెను?

జ:—హర్షుడు క్రీ. శె. 648 లో మరణించెను. ఇతని వెనుక వచ్చిన రాజులు బలహీనులగుటచే హర్ష సామ్రాజ్యము క్రమ క్రమముగా క్షీణించెను.

(సశేషము)

---

# బడి తోటలు

నిన్న మొన్నటివరకు మనప్రాథమిక పాఠశాలలలో చదువుట, వ్రాయుట, (అంక) గణితములను నీమూడింటిని మాత్రమే నేర్పుచుండెడివారు. ఇప్పటి పద్ధతియది కాదు. బాలురయెదుట ప్రయోగములు చేసి, (Experiments) వారిచే చేయించి, యందలి విషయములు బాలురకవగతమగునట్లుచేయుట సులభమని గ్రహించి యీ పద్ధతినే మనయుపాధ్యాయ సోదరు లమలులోనికి తెచ్చుచున్నారు.

కొంతకాలమునుండి బాలురు తోటలో కొంతసేపు పనిచేయుట వారివిద్యాభ్యాసమునకొక ప్రధానాంశముగా నెంచబడుచున్నది. స్వాభావికముగా బాలబాలికలారామకృషియందాసక్తిగలవారు. ఒక్కొక్కవిద్యార్థికి బడియావరణయందొక్కొక్క చిన్నమడినిచ్చి, వారిచే మళ్లనుత్రవ్వించి, విత్తించి, మొక్కలను తమస్వహస్తములతో పెంచునట్లేర్పాటుచేసిన పిదప నామొక్కలుపూయునపుడును, కాయునపుడును వారియొక్క సంతోషమునకు మేరయుండదు. ఇవ్విధమున నొకపరి కార్యసిద్ధియయ్యేనేని మరింత కృషిచేసి ఫలమధికముగ పొందవలయునని వారిమనములయందుకుతూహలముదయించును. పదిమంది బాలురుపనిచేయునపుడు పోటీపైని మరియొకనికన్న తానెక్కువ ఫలమనుభవించుటకు తానెక్కువ పని చేయవలయునను కార్యదీక్ష వారికికలుగును. ఇవ్విధమునకార్యదీక్షయు, కార్యోత్సాహమును, సహజశీలములై భావికాలమున వారిజీవితముల కాదర్శములగును.

బుద్ధి విశేషముగా లేనివారిని మొద్దులని కొందరందురు. అట్టివారికి ఆరామకృషి మిగుల లాభకారిగా నుండును. నేటికాలమున మనకు కావలసినది పండితోత్తములే కాదు ఓపికతో నొడలువంచి పనిచేయువారును కావలయును. బడితోటలు ఏటేట విద్యార్థులను తోటమాలీలుగ తయారుచేయుటకా యని కొందరడుగ వచ్చును. కాదు. ఆరామకృషివలన నిట్టి బాలుర పరిశీలనాదృష్టి పెంపొందును. పరిశీలనాదృష్టి లేనప్పుడు, బాలునిజ్ఞానాభివృద్ధికి నిజమైన మార్గమే లేదు.

వస్తుపరిశోధనచేసి స్వయముగా తెలిసికొనినదే జ్ఞానము గాని గ్రంథములను వల్లెవేయుటవలన కలిగి దిజ్ఞానముకాదు నేటి విద్యాధికులలో రెండు గొప్ప లోపములు కాన్పించుచున్నవి. I పుస్తకములోనున్నదే జ్ఞానమని తలంచుట, II ప్రకృతిశోధనకు ప్రయత్నింపకుండుట. ఇటువంటి దురభిప్రాయములను తొలగించుటకై ప్రాథమిక పాఠశాలలయందు తోటలు పెంచుట మిక్కిలిశ్రేయస్కరమని ఋజువగుచున్నది.

వ్యవసాయకళను చాలమంది నీచభావముతో చూతురు. ఉపాధ్యాయులే శ్రద్ధతో తోటలో పనిచేయుచున్నపుడు విద్యార్థులు కూడ మిగుల హెచ్చరికతో పాటుపడుదురు. అందువలన క్రమముగా వ్యవసాయకళయందుండెడి నీచభావము తొలగగలదు. కావున ఉపాధ్యాయ సోదరులను నామమాత్రమే బడియందు తోటలు పెంచుటగాక ఆతోటలయందు బాలురచే పనిచేయించుచు, దేశాభివృద్ధికై పాటుపడియెదరుగాక యని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

అరసాడ భానుమూర్తి.

# "ఏమిటి బాబూ ఇది"

(యం. వి. సత్యనారాయణ)

'యాదవపల్లె' అను ఒక గ్రామము కలదు. అచ్చటనుండు వారెవరో వేఱుచెప్ప నక్కరలేదు. వీరలకు ఒక గ్రామపెద్ద సన్యాసిరావు అనునతఁడు గలఁడు. ఆ జానబాహువు; నీలమేఘచ్ఛాయ, కొద్దిపాటి ఆస్తియు గలవాఁడు. ఏదో కొంత వఱకు చదువుకున్నవాఁడు కూడాను. తాలూకాబోర్డు లున్నకాలముననే తంటాలుపడి ఒక పాఠశాల తెచ్చుకొనిరి. "క్రొత్తొక వింత, పాతొక రోత" అన్నటుల మొదట బాలురను పాఠశాలకు విరివిగా పంపుచుండిరి. గాని క్రమక్రమముగా దిగజాఱుచుండె. అందుచే అనేకమంది ఉపాధ్యాయులు వచ్చుట "ట్రాన్సుఫరు"గుట జరుగుచుండెను. కొద్దికాలము క్రిందట హిరణ్యాక్ష హిరణ్యకశిపుల కాలమున దేవతలను, ఋషులను కాపాడుటకు నరసింహావతారము దాల్చి భగవంతుఁడు నిర్మూలించిన విధమున నారాయణుఁడను ఒక నియోగి బ్రాహ్మణుడైన ఉపాధ్యాయుని అచ్చటికి బదిలీచేసిరి. సామెత సార్థకమగునటుల బాలురు వచ్చుట ప్రారంభించిరి. విద్యాధికారులు, ఇతర ప్రేక్షకులు, వచ్చిచూచి "పాఠశాల చాల అభివృద్ధి అయినది; ఇదివఱకు వచ్చిన ఉపాధ్యాయులు ఇట్లు శ్రద్ధవహించలేదు"; అనుచు వ్రాయుచు వెళ్లుచుండిరి. ఇట్లు ఏడెనిమిది మాసములు జరిగినది. వేసంగి ప్రారంభమయినది. పొలములలో ఏపైరును లేక నిరామయముగానున్నది. అందు ఉప్పాకు మాత్రము బాగుగా పెరుగుచున్నది. మన గ్రామములోని బాలురు పొలములలో కట్టివైచిన గొడ్లను విప్పుకొనివచ్చి, వాటిమేత మొదలైనవి సర్ది పాఠశాలకు వచ్చునప్పటికి 8 గంటలగుచుండెను. మఱల 9 గంటలకు పశువులను తోలుకొని వెళ్లుటకు ఇంటివద్దనుండి కబురులపై కబురులు, పొలికేకలు వేయుట ఉపాధ్యాయుఁడు కొంతకాల ముపేక్షించి గ్రామపెద్ద అయిన సన్యాసిరావుగారితో చెప్ప వలెనని ఆయనయింటికి వెళ్లెను. అప్పటికి ఉదయము 7½ గంటలయినది. మన రావుగారు ఇంకను నిద్రమంచమునుండి లేవలేదు. అందుచే మన ఉపాధ్యాయుఁడు ఆయన లేచువఱకు అచ్చటనే ఉండి మాట్లాడి రావచ్చునను తలంపుతో కూర్చుండెను. పెద్ద కొఱకు మఱికొందఱును వచ్చి వేచియుండిరి. 8 గంటలకు లేచి చొంగకాఱుటచే అట్టలుగట్టి తెల్లగానున్న చాఱలతో బయటికి వచ్చెను. అయ్యగారు వచ్చుచున్నారని అందఱును లేచి నిలువబడి దండప్రణామము లాచరించిరి. కాని మన మాష్టరుగారు ఏదో ఆలోచించుచు కూర్చుండిరి. అందుచే ఇదంతయు కనుగొనలేక పోయిరి. తల త్రిప్పిచూడ ఇది అంతయు చూచి ఆశ్చర్యపడి తనువచ్చిన పని త్వరలో చెప్పి వెళ్లవలెనని "బాబూ! పాఠశాల విషయములో ఎవరును శ్రద్ధ తీసికొనుటలేదు. గొడ్లదగ్గఱకని, మేతకని, తల్లిదండ్రులు బాలురనుపంపుటచే బాలురు పాఠశాలకు వచ్చుటలేదు. తలిదండ్రులకలసికొంటిని; అనేకవిధముల చెప్పితిని; పాఠ

శాలకు మాపనులగువఱకు సెలవియ్యండి అయ్యవారూ! అని చెప్ప ప్రారంభించిరి. మీరయిన తగుశ్రద్ధతీసికొన వలెనండి" అనిచెప్పిరి. "అవునండి బాబు, కాకపోతే ఇదేమిటి? ఎప్పుడు పారశాలే? చాలా బాగుంది" అన్నాడు మనపెద్ద. సెలవండి, అన్నాడు మనమాష్టరుగారు.

---

# సామాన్య నీతులు

వేదుల సూర్యనారాయణశాస్త్రి

అనృతము అఘముగూర్చు
ఆయమరసి వ్యయముగనుము
ఇంటగెలిచి రచ్చగెలువు
ఈశుగొలువు మెల్లవేళ
ఉత్తమాట చెత్తప్రోగు
ఊరకుంట ఉత్తమంబు
ఋణపడక చరించు మెపుడు
ఎగ్గుదలప నెగ్గుమూడు.
ఏరినైన దూఱవలదు
ఐకమత్య మరయ బలము
ఒరుల గూడి యుండు మెపుడు
ఓరిమికలిగిన కోరికలందును
ఔన్నత్యము నందగోరు
అండలేక నుండబోకు
కలసి మెలసి మెలగు మెపుడు
ఖలులగూడి మెలగరాదు
గర్వమంత కట్టిపెట్టు
ఘనులచెలిమి గాంచగోరు
జ్ఞానమబ్బు చదువువలన
చదువుగూర్చు చాలఘనత
జనులమాట వినగవలయు
డంబములు నడంచుకొనుము
తప్పులున్న ఒప్పుకొనుము
దయగను మందరినెప్పుడు
ధనముకన్న ఘనమువిద్య
నయముగలిగి నడచుకొనుము
పరులవినకు మరుగునుండి
ఫలము గలుగు పాటువలన
బలముగలుగు బ్రతుకెసుఖము
మంచితలపు లుంచుమదిని
రట్టుమాను గుట్టునుంచు
లగ్గుచేయ లగ్గు గలుగు
వశము గానిపనికి చొరకు
శక్తికొలది జరుపుపనుల
సంఘబలము చాల ఘనము
హరినినెపుడు మరువకుండు

---

# బాలవిజ్ఞానము

వేదుల సూర్యనారాయణశాస్త్రి

౧

మల్లెలుమొల్లలు పూచేవేళ
చల్లనిగాడ్పులు వీచేవేళ
మేనుల గంధం బలదేవేళ
ఉరుములు మెరుపులు మెరసేవేళ
తొలకరివానలు కురిసేవేళ
మామిడిపండులు పండేవేళ
మన్మథబాణము మ్రోగేవేళ
మగువల మనసులు క్రాగేవేళ

౨

అరటికాయ బజ్జి
మినప్పప్పు సొజ్జి
కలసి మెలసి తిందాం
బుధులకథలు విందాం

3 జోలపాట

చిన్నారిపొన్నారి చిలుక వేసివు
బంగారుపంజరపు చిలుకఏడువకే
ఏడువకు ఏడువకు ఎర్రన్నిపాప
ఏడిస్తెనీకంట నీలాలుగారు
చిన్నారిపొన్నారి గాజుల్ల శెట్టి
తేవోయి అమ్మాయికి తేనెగాజుల్లు
తేనెగాజుల శెట్టి టెంకాయశెట్టి
నల్లగాజుల శెట్టి మా వాడరమ్మ

౪. లెక్క

ఒకటీఒకటీ ఒప్పులకుప్ప
రెండూరెండూ రెక్కలపిట్ట
మూడూమూడూ ముక్కాలిపీటా
నాలుగూనాలుగూ నా ఆవుకాళ్లు
అయిదూఅయిదూ అరచేతి వ్రేళ్లు

౫. బిడ్డను లాలించుట

చిట్లపొట్లకాయ చిమ్మనేరేడుకాయ
గొల్లపుచ్చకాయ గోరుచిక్కుడుకాయ
అత్తకుపెట్టుదు అల్లం నేతిందుబెల్లం
కొత్తకుండల్లాల గోధుమల్లాలా
పాతకుండల్లాల పసిబిడ్డల్లాల
పేపేగుజ్జం పెండ్లికిపోయె
తామరగుంటకు నీళ్లొచ్చె
గారా బూరా దసుక్క
సూదా? దబ్బనమా.

# వ్యాయామము

తేజోమూర్తుల మల్లిఖార్జునుడు

ప్రపంచములో ఆరోగ్యముగాను, సౌఖ్యముగాను, నుండదలచినచో ప్రతి వారును "ఆరోగ్యమే మహాభాగ్య" మను నట్లు ఆరోగ్యసూత్రములను పాటించు చుండవలెను. ఆరోగ్యసూత్రముల పాటించుట యనగాఅర్థము తెలియని మంత్రము లవలె యేకరువు పెట్టుటవలనగాని, పెట్టించుటవలనగాని, లాభములేదు. మనము తెలిసుకొనిన విషయములు యెప్పుడైతే ఆచరణలోయుంచి నెరవేర్చుదుమో ఆ నాండే మహాభాగ్యమబ్బును. మనముగ్రామాలలో రైతులు పూర్వపువారిని గురించి మాట్లాడుకొనునప్పుడు విన్నచో మన కాశ్చర్యము కలుగును. ఇంతబలము పూర్వపువారికి ఎట్లు కలిగెనాయని సందేహము తట్టును. పూర్వపు మనుష్యులు వేరు; వారిది అన్నగతప్రాణము. అయితే మనదో కాఫీ గతప్రాణము. తెల్లవారిలేచే సరికి కాఫీ, టీ, కారాకిల్లీలు పలుదోమకుండా సేవించే మహానుభావులు అనేక వందలూ, వేలుకూడా వున్నారంటే ఆశ్చర్యములేదు. దానికికారణము పాశ్చాత్య నాగరకతా పంకంలోపాతుకుపోయి మనం కూడా "దొర్లం" అనిపించుకోవాలని చూస్తున్నాం. కాఫీ, టీ, కారాకిల్లీ, చుట్ట, బీడీ, సిగరెట్టు, సారాయి, వీటివలన శరీ

రమునకు ఆరోగ్యముగలుగునా? దురభ్యాసముల కలవాటుపడినవారు ముఖ్యముగా చదువుకోని మూర్ఖులకన్న చదువుకున్న మూర్ఖులే యెక్కువ. వీరేమిచెప్పుదురనగా "సానిలేనివాడు నరసుడు గాడు, సారా త్రాగనివాడు సభ్యుడు"గాడు అంటారు. ఈ రెండింటివలన ఎంత ఆరోగ్యము చేకూరునో చదువరులే యూహింతురుగాక!

శరీర వ్యాయామములో స్త్రీలకున్న యభిలాష మనకులేదు. ప్రస్తుతము చెన్నపురిలో ఆంధ్రసభ స్త్రీల శాఖాధికారిణి అయిన శ్రీమతి "గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు" స్త్రీలవిషయములు చేయుచున్న కృషి అనల్పమైనది. ఇప్పుడేకాదు. పూర్వకాలంలో అంతఃపుర స్త్రీలుకూడ శరీర వ్యాయామమునకు యెక్కువ శ్రద్ధ వహించేవారని, భారత, భాగవత, రామాయణాదిగ్రంధములవలన తెలియుచున్నది. ఉదా.—భా. గ. "బాలికలతోడ చెలరేగి బంతులాడు" "బువ్వతీగెలకును బోదిసేయు" అని బమ్మెరపోతన్నగారు రుక్మిణీ బాల్యక్రీడలను చక్కగా వర్ణించినాడు. ఒక్కటేమిటి? ఇటువంటి వనేక నిదర్శనాలు చూపించవచ్చు. దీనిని బట్టి అంతఃపుర స్త్రీలుకూడ యేదోయొక విధముగ అనగా పువ్వుల మొక్కలకు పాదులు చేసో, నీరుతోడో, చెలికత్తెలతో బంతులాడో - యేదోవిధముగ శరీర వ్యాయామముచేసి శరీరసౌష్టవమును, శరీరారోగ్యమును, పెంపొందించుకొనెడి వారని స్పష్టమగుచున్నది. పూర్వపు విద్యార్థులకును ప్రస్తుత నవనాగరికత, సభ్యతలలో సభ్యులైన విద్యార్థులకును, యెంతో వ్యత్యాసముకలదు. ఇప్పటి విద్యార్థులు చదువులలోనేమి, వినయవిధేయతలలోనేమి, ఎంతో వెనుకబడియున్నారు.

ప్రస్తుత విద్యానిబంధనలలో బడితోట ముఖ్యావసరము. వాటికి మళ్ళను కట్టుట, గొప్పుత్రవ్వుట, నీళ్లుపోయుట, బాలురచే చేయించి తాను చేయుట ఉపాధ్యాయుని కర్తవ్యము. పిల్లలచే నీళ్లుపోయిస్తే వారి పెద్దలు "మేము ఉద్యోగస్థులముగదా మా పిల్లలచేత నీరు తోడిస్తారా? గొప్పు త్రవ్వించుటకు మేమేమి వ్యవసాయదారులమా? మాపిల్లలకి పనిచెప్పకండి మాకు చాలా షేమ్‌గా వుంటుంది. అలాచేస్తే మాపిల్లలని బడిమానిపించేస్తాం"అంటారు. మనవారికి బానిసచదువులేగాని బ్రతుకు తెరువులక్కరలేదు. ఈ పనులవలన తమ శరీరమునకు చేతులకు, కాళ్లకు, ఎంత వ్యాయామము కలిగిస్తున్నారోయెరుగరు.

తమ పొట్టకూటికోసం పాటుపడు కమ్మరి, కుమ్మరి, కంచరి మొదలగువారు ఎల్లప్పుడు తమచేతులతో ఎక్కువపని చేయుటవలన వారిచేతులు కండలుతిరిగి యుండును. నడచువారి పిక్కలు, కావిడి మోయువారి భుజములు కూడ ఎంతో బలముకలిగి కండలు కలిగివుండును. ఇటువంటి వారికి యేరోగమైనను వచ్చునా? మనపూర్వులు 110 సం॥రములు కూడా బ్రతికినట్లు మనము వినలేదా? వారు దీర్ఘాయుష్మంతులగుటకును, ఇప్పటివారు అల్పాయుష్కులగుటకును, కారణమేమి? తగినంత శరీర వ్యాయామములేక దురభ్యాసములకు లోనగుటయే! కాన "శరీరమాద్యంఖలు ధర్మసాధన"మ్మను నార్యోక్తి ననుసరించి శరీరమును చక్కగా పోషించుకొన వలెనని ప్రార్థన.

# బడి పంతుళ్ల అవస్థ

'ఎస్. వి యస్'

మన విద్యావిధానం బజారునవేసిన రోత్త పోయింది. మనకు విద్యరావడం అప్పుడప్పుడు వచ్చిపోతుండే అధికార్లదయ ఒక్కొక్కడికి ఒక్కొక్క విషయంలో ప్రావీణ్యం, అభిరుచి — ఎవరిపాట వారికి పాడాలె - బోగందాని మోస్తరు - బోగం దానిలో ప్రేమెంత ఉంటుందో యిప్పటి విద్యావిధానాలలోను - విద్యాలయాల లోను - విద్య అంతవుంటుంది.

మాకొక అధికారి ఉన్నాడు. ఆయన అపరప్రహ్లాదుడు. "లీలందును బొంకులు లేనివాడు". ఏదోమఠానికి చెందినవాడట. జాగ్రఫీలో గండపెండేరి. ఇంకేం బళ్లో భజనలూ, జాగ్రఫీ ఉంటేచాలు. ఇటు వంటి అధికార్లు వస్తేనేగాని విద్యాపరిణామం పరిపూర్తిగాదు. అది వీధిబడినుండి క్రమేణ పాఠశాల, విద్యాలయం, భజన మందిరం, వరకు వచ్చింది. ఇక ఈశ్వరత్వము సంపాదించి నామరూప రహితం కావటమే తరువాయి.

భక్తి, జ్ఞాన, వైరాగ్యాలు మూడు మెట్లు మోక్షానికి. వీనిని ఒకదాని తర్వాత మరియొకటి యెక్కడం సహజమైన అభివృద్ధి ఇప్పుడు పాఠశాలలకు ఈశ్వరత్వం సంపాదించడంలో ఆయన కృషికి ఫలంగా డబుల్ ప్రమోషన్ యిచ్చారు ఒక్కసారే వైరాగ్యానికి. అంటే "అభావే విరక్తిః" అన్నారుగా పెద్దలు. ఆపైని మన భక్తునికి మోక్షప్రాప్తి తప్పక సంభవిస్తుంది.

ఆయన ప్రాపగాండా వర్కుచేస్తాడు. విద్యగాదు - భగవద్గీత - భజనసమాజాలు. డైరీలో మట్టుకు "ప్రాపగాండా వర్కని" వేసుకుంటాడు. అబ్బే బొంకనేదిలేనేలేదు ఆత్మవిషయంలో తప్ప. మేస్టర్లు భజనకు రాకపోతే తప్పు. ఆయన చేసే గీతోపన్యాసానికి - పొరపాటు - ప్రాపగాండా వర్కుకు- హాజరు గాకపోతే తప్పు. మాస్టరేంచేస్తాడు పాపం. పొట్టకూటికై యేపనైనా చేస్తాడు. అధికారీ చేసే పనీ అదే. లేకపోతే ఆయనకు ఉద్యోగం యెందుకూ, యే సన్యాసి మఠంలోనో కలిస్తే సరిపోతుందిగా !

బాబూ! ఎందుకొచ్చిన పిశుష్క వేదాంతాలు? ఈ వేదాన్నించే మనదేశమీ స్థితికొచ్చింది. ఇకచాలు. దేశంలో కావలసినది జీవితావసరాలని తీర్చే విద్య. భారతదేశంలో ప్రతి ఒక్కడు విద్యగలవాడు గావాలి. అప్పుడే మనదేశానికి మోక్షం. మనం బానిసలం. ప్రభుత్వం యేదో వారికిష్టమైన విద్య మనకివ్వ ప్రయత్నిస్తుంది. అధికార్లు దాన్నే మన నెత్తిన రుద్దటమే తమ విధియనితలుస్తారు. జీతాలు తీసుకుంటూ, దానిని ప్రజోపయోగకరంగా మార్చ యత్నించరు. దేశంలో పుట్టినందుకు వారివిధి నిర్వర్తించనవసరము లేదు కాబోలు !

ఎంతకాలం అధికార్లు పైవారి విధానాన్ని మనపై రుద్దడమే తమవిధియని తలుస్తూ, తమ అధికారాన్ని దుర్విని

యోగం చేస్తారో, అంతకాలం మనగతి యింతే. కాబట్టి పాఠశాలలు వృద్ధిచెందా లంటే, విద్య పెంపొందాలంటే, ఉపాధ్యాయులకు యితర దిగులూ, చింతా లేకుండా తిండీ, బట్టా యివ్వాలి. వారికి ప్రోత్సాహమివ్వాలి. ఉపాధ్యాయులకూ, అధికార్లకూ, మధ్య సుహృద్భావం పెంపొందాలి. వారు చెలాయించేవారు, వీరు చెలాయింపబడేవారు — అనే పద్ధతి పోవాలి. విద్యాభివృద్ధికి యిరువురూ పాటుపడాలి.

---

# తెనుఁగు యోధుఁడా!

(మే. శ్రీరాములు, 8వ తరగతి బోర్డు హయ్యరు ఎలిమెంటరీ స్కూలు, కొవ్వలి)

అఖిలపుణ్యప్రదేశమీ - యాంధ్రభూమి
మేటివీరులఁ గన్నట్టి - మేటితల్లి
సకల సౌభాగ్యముల నిచ్చి - సాకుతల్లి
† కట్ట! నేఁడు పరులచే న - ఘ భరితగద.
అట్టి తల్లి ఋణముఁ దీర్ప - నదనుగలిగె
బద్ధకంకణమున నీవు - పరుగులిడుచు
ఆంధ్రవీరుఁడ! యోధుఁడ! - ఆంధ్ర బాల!
† సత్యసమరమునకు రమ్ము - సత్వరమున.

N. B:—† ఈచరణభావాలు వివరించలేకపొయ్యాడు రచయిత. ఏదీ-పాపం-ప్రారంభమేగా-ఇదీ! (సం)

---

# శ్రావణ భాద్రపదములు

వేదుల సూర్యనారాయణశాస్త్రి

అనగా అనగా ఒక బ్రాహ్మణుఁడు. అతని పేరు సోమయాజులు. భార్య సోమిదేవి. ఒకనాడు సోమయాజులు కాశికి బయలుదేరెను. "శ్రావణ భాద్రపదాలు" వచ్చును. జాగ్రతగా యిల్లు దిద్దుకొనుము అని భార్యతో చెప్పెను. ఈమాటలను ఇద్దరుతుంటరులు వినిరి. సోమయాజులు యిల్లువిడచి పోయినతరువాత ఆతుంటరులు అతనియింటికి వచ్చిరి:—

సోమిదేవి:—మీరెవరు?

తుంటరులు:—మేము శ్రావణభాద్రపదాలము.

సోమి:— కాళ్లు కడుగుకొనుడు, దయచేయుడు. మీరువచ్చెదరని నాభర్త యిపుడేచెప్పెను.

అని సోమిదేవియనగా వారాయింటనే సమస్తమర్యాదల నందుచు పిండివంటలతో విందులారగించుచు సుఖముగా నుండిరి. ఇట్లు రెండుమూాసములు గడచినవి. ఒకనాడామె వారికి వడ్డించుచుండ సోమయాజులువచ్చెను. వెంటనే యాదుండగీండ్రు పారిపోయిరి. పారిపోవువారిని జూచి యాతడు భార్యతో "వీరెవరని" ప్రశ్నించెను. "మీారు చెప్పినది జ్ఞాపకము లేదా! వీరే శ్రావణభాద్రపదాలు" అని ఆమెచెప్పెను. "ఎంత వెర్రిదానవే! శ్రావణభాద్రపదాలు నెలలు. మనుష్యులు అనుకొంటివా? ఎంత అమాయకురాలవు!" అని సోమయాజులు చెప్పెను. మోసము జరిగినందులకు ఆలుమగలు కొంతసేపు విచారించిరి.

---

# కాలెండరు సంవత్సరము గడచిన మరుసటి రోజున పంపవలసిన రిటరన్సులో ఫారము A

పాఠశాల పేరు: మేనేజరు పేరు:

1-1-194 నుండి 31-12-194 వరకు వివరములు.

1. తనిఖీచేసిన ఆఫీసరుహోదా. 2. తనిఖీతేదీ. 3. మొత్తము రోలు హాజరు. 4 (ఎ) నియమిత ఉపాధ్యాయుల సంఖ్య (బి) హాజరులోయున్న ఉపాధ్యాయులసంఖ్య (ఉపాధ్యాయుడు గయిరుహాజరైన కారణము) 5. విజిట్లు సమయములందు బడిమూాయబడియున్నందుకు కారణములు. 6. రిమార్కులు.

## ఫారము B

పాఠశాలపేరు. మేనేజరుపేరు

1-1-194 నుండి 31-12-194 వరకు వరకు వివరములు.

| | | | |
|---|---|---|---|
| 1 హోదా. | (2) ఉపాధ్యాయుల పేర్లు. సర్వీసుకాలము ఏ తేది నుండి-ఏ తేదీవరకు. ఒకే పోస్టులో యిద్దరు లేక ఎక్కువమంది పనిచేసి యుండినచో A B. C అనుగుర్తులలో వరుసగా వ్రాయుము. సర్వీసు కాలము నుండి వరకు గుర్తించుము. | (3) పుట్టిన తేదీ | (4) టీచర్సుసర్వీసు రిజిష్టరు నంబరు. ఇందు విద్యార్థికారివల్ల కౌంటరుసిగ్నేచరు చేయించుకొనినది లేనిది, సదరు రిజిష్టరు లేనివారికి దరఖాస్తు పంపబడినది లేనిది దరఖాస్తు పంపుకొని యుండిగను తేదీ వివరములు. |

5. సాధారణ విద్యావిషయిక యోగ్యతలు E. E. L. C. అయినయెడల F A I R లేక Good అను వివరములు IV ఫారములు చాలించియుండిన యెడల III ఫారం పరీక్షఅయినది లేనిది IV లో ప్రవేశించి వదలిన వివరములు ఇందు విషయమై అధికార్ల ఉత్తర్వులు ఏమైనయున్న యెడల వాటివివరములు పూర్తిగా వ్రాయవలెను. సర్టిఫికెట్లు తేదీలు నెంబర్లు గుర్తించవలెను.

6. వృత్తిసంభంధమైన యోగ్యతలు (A) ట్రైనింగ్ అయినచో గ్రేడు (B) పరీక్ష అయినసంవత్సరము (C) సర్టిఫికెట్టు నంబరు P. T. C. & T. T. C (D) ప్రాక్టికల్ పరీక్ష అయిన తేది (E) ప్రొబేషనరీ గడువు పొడిగింపబడిన ఎడల అట్టి కాలపరిమితి ఎప్పటినుండి ఏ తేదీవరకు ఉత్తర్వు నంబరు తేది (F) పరీక్షకాని వారికి Exemption ఉత్తర్వుయిచ్చిన నెంబరు తేది కాలము ఏ తేదీనుండి ఏ తేదీవరకు (G) ట్రైనింగ్ కాని వారికి Exemption యిచ్చిన ఉత్తర్వు నెంబరు తేదీ కాలము ఏ తేదీ నుండి ఏ తేదీవరకు (H) సంవత్సరములో వాడుకొన్న సెలవువివరములు తేదీలతో సహా ప్రతిఉపాధ్యాయునకు ఎదురుగా చూపవలెను.

# ఫారము C

పాఠశాల పేరు మేనేజరు పేరు

స్టాగ్నేషన్ వగైరావివరములు From 1—1—194 to 31—12—194 వరకు

| నెలలు | తరగతివారి స్టాగ్నేషనుల సంఖ్య | | | | | అనుమతిలేని ప్రవేశముల సంఖ్య | | | | | 5 సం॥రంల వయస్సుకు లోబడినవారు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | I | II | III | IV | V | I | II | III | IV | V | |
| 1 | | | | | | | | | | | |
| 2 | | | | | | | | | | | |
| 3 | | | | | | | | | | | |
| 4 | | | | | | | | | | | |
| 5 | | | | | | | | | | | |
| 6 | | | | | | | | | | | |
| 7 | | | | | | | | | | | |
| 8 | | | | | | | | | | | |
| 9 | | | | | | | | | | | |
| 10 | | | | | | | | | | | |
| 11 | | | | | | | | | | | |
| 12 | | | | | | | | | | | |

# విదేశ విద్యావిధానములు

నడింపల్లి వెంకటసుబ్బారావు

[ ప్రస్తుతము మన విద్యావిధానము లోపభూయిష్టమైనదనియు, భారతీయావసరముల తీర్చునట్టిది కాదనియు, నను విషయము సర్వాంగీకారమే. దీనినెట్లమార్చిన భారతీయుల కనుకూలముగానుండునది నిర్ణయించుటకు ప్రపంచమునందలి వివిధ దేశములలోని విద్యావిధానములను గూర్చి తెలిసికొనవలసిన యవసరమెంతేని గలదు. అందువలన ప్రపంచమందలి అత్యుత్తమ ప్రజారాజ్యమైన రష్యాయందలి విద్యావిధానముగూర్చి పరిశీలింతము. అందువిలక్షణమైన సాంఘికవ్యవస్థగూడ నేర్పడియుండుట గమనింపదగియున్నది. అట్టి వైలక్షణ్యమును వారెట్లు సాధించిరదిగూడ యోచింపదగియున్నది ]

## రష్యా :

### జీవితశిక్షణ (Training for life)

(ఆంగ్లమునండి ఉద్ధృతము)

1918 సం॥లో గత ప్రపంచ యుద్ధానంతరము రష్యాయందలి విప్లవ ఫలితముగ బోల్షివిక్ పార్టీ ప్రభుత్వమునకువచ్చెను. వెంటనే ఒక పత్రము ద్వారా దీర్ఘకాలముబట్టి, ఒక విద్యాపునర్నిర్మాణ ప్రణాళికను ప్రకటించినది. దీనిని చాలభాగం లెనినే ప్రోత్సహించి ప్రకటించినాడు. కాని యిది యేమాత్రమును తదితర ప్రపంచదృష్టి నాకర్షించలేదు. ఇప్పుడు యీ విద్యావిషయిక విప్లమును గురించి చదువుతున్నామంటె ప్రస్తుతము సోవియట్ సామ్యవాద ప్రజాస్వామ్య ప్రభుత్వమునందలి సాంఘిక జీవనముయొక్క సక్రమమయిన స్థితిని తెలియజేస్తుందనిగాదు ఏలనంటే 1917 లో సూచింపబడిన ప్రతిపాదనలు, 1935 సం॥ వరకు బాల్టిక్ మొదలు పసిఫిక్ మహాసముద్రమువరకును పూర్తిగా నమలు జరుపబడలేదు. సరిగా చెప్పవలసినయెడల యీ 18 సం॥లలో నా ప్రతిపాదనలలోనే ఒక్కటికూడ పూర్తిగా నమలు జరుపబడలేదు అందువలన సోవియట్ కమ్యూనిజం తమ నూతనసంతతిని నూతన వ్యవస్థలోని జీవిత విధానమున కెట్లు శిక్షణనిచ్చుచున్నది తెలుసుకొనుటకును, 1917 నుండి విద్యావిషయిక విప్లవము యేయేమార్పులను చెందినది, యెట్లు సదరు మార్పులను తేగలిగినది తెలిసికొనుటకు మాత్రమే చదువుచున్నాము వాని ప్రాముఖ్యమును గమనింపవలెనంటే 1918 సం॥పు ప్రతిపాదనలను యథాతథాగానే చూడవలెను దానిని గురించి యేమిచెప్పయత్నించినను దాని ప్రాముఖ్యమునుభంగపరచిన వారమగుదుము.

జారుకాలమునందలి రష్యాలోగూడ విద్యావిధానము లేకపోలేదు అది ప్రభుత్వముయొక్క సంకుచిత స్వభావమునకు తగినట్లుండి కొంత ఔన్నత్యమును పొందినది యుద్ధమునకు పూర్వము కొందరుదారస్వభావుల దయవలనయిది కొంతవ్యాప్తి చెందినది కాని యీవిద్యావిధానము చాల సనాతన పద్ధతులపైనుండెడిది. ప్రజలను కోర్టులకు, గవర్నమెంటు ఆఫీసులకును, పనికివచ్చు గుమాస్తాపనులకు తయారుచేయుటకును, ధనికులకో పనికివచ్చునట్టియు, వర్గభేదమును పెంపొందింపజేయు పనులకు ప్రోత్సహించబడుచుండెడివి అంతకు తప్ప విద్యావిధానము, మతసంఘములచేగాని, జారుచేగాని ప్రోత్సహింపబడుటలేదు. ఈ నిరంకుశ విధానము ప్రజలకు చదువను, వ్రాయను, నేర్పు నుదారత్వమునైనను వహించలేదు. 1917 లో, లెనిను, అతని

యనుచరులు, యీ నిరంకుశ విధానముచే నడికట్టబడిన విద్యావ్యాపనావిధానమును తుడిచివైచి, దాని స్థానే సర్వసమానమై, వర్గరహితమైన 'విజ్ఞానమును' (Enlightenment), వివిధరకములై, పరిపూర్ణమైన జీవిత శిక్షణను శిశువాది వృద్ధునివరకును ఒసంగ నిశ్చయించిరి. ఇట్లుచేయుటలో పూర్వము నుండి వచ్చుచున్న సాంప్రదాయములను పూర్తిగ త్రోసివైచి, ప్రతిశాఖయందును ఆధునిక శాస్త్రము నాధారముగా జేసికొని, యేవిధమైన రహస్యముల నట్టిపెట్టక, ప్రతి వారికిని, తాము నివసించు సంఘమున కుపయోగపడునట్లు శిక్షణ నొసంగనెంచిరి. ఈ విధానము సిద్ధాంతరీత్యా హృదయపూర్వకముగాను, ఉదారముగాను, అందరును కట్టుపడియుండునట్టిదిగాను,యుండవలెను కాని యీవిప్లవమునెట్లు తీసికొని రావలసినది పై పత్రమునందే వివరింపబడినది. అందీవిషయములు గలవు అన్నివయస్సులవారును, అన్నివిషయములను, స్త్రీ పురుషులు కలసి విద్యనభ్యసించవలెను పరీక్షలుగాని, శిక్షలుగాని లేకుండ బాల్టిక్ మొదలు పసిఫిక్ వరకు, 8 మొ 17 సం॥ వరకుగల ప్రతి బాల బాలికయు పది సంవత్సరములు విద్యాభ్యాసముచేయవలెను వీనికి సహాయకారులును పాఠశాలా ప్రవేశమునకు ముందివ్వవలసిన శిక్షణనిచ్చుటకు, అనగా 3 మొ॥ 8సం॥ల బాల బాలికలకు, సార్వజనీనకమైన పద్ధతులపై నడపునట్టి సంస్థ యేర్పాటుచేయబడినది అంతియగాక ప్రత్యేకము వృత్తిశిక్షణను, శాస్త్రశిక్షణను, యిచ్చునట్టి సర్వవ్యాప్తమైనట్టి పంచవార్షిక శిక్షణోద్యమముగూడ 18 మొ॥ 22 సం॥లవారికేర్పాటు చేయబడినది. ఇట్టిశిక్షణయే కొద్దిమందికో యిచ్చుటగాక, దానికి తలియుండిన వారికందరకును, ప్రభుత్వోచిత వేతనములపై అన్ని వృత్తులకును యివ్వబడినది. అన్నిటికన్న విప్లవకరమైనది 'బహుశాస్త్ర నైపుణ్యపాఠశాల, Poly technicalschool) ఇందుసిద్ధాంతములుఅనుభవము నేర్చుకొనుట, చేయుట; శాస్త్రము, ప్రయోగము; ఉపాధ్యాయుల యుపన్యాసములు, విద్యార్థుల నిర్మాణయుక్తమైన సూచనలు మొదలగునవి యేర్పాటు చేయబడినవి. ఇవి యన్నియును విద్యార్థులను వర్గభేదములేని జీవితమునకు తయారు చేయుటకును, మానసిక, శారీరిక, శ్రామికుల మధ్యనుండు అంతరమును కలుపుటకును, తద్వారా తీసివేయుటకును, బహిరంగ ప్రయత్నమొనర్చి ఒకవిధమైన ఐక్యతను సంపాదించుటకు నిశ్చయమును తెలియజేయుచున్నవి. ఈవిశాలభావముతోనే ప్రస్తుత సోవియట్ విద్యావిధానమునందలి ముఖ్యమార్గము లనుసరింపబడుచున్నవి.

## సార్వజనీనత (Universalism)

మనమిప్పుడు1917నుండిచెందినయభివృద్ధినిగురించిగాని, 1935లో సోవియట్ విద్యావిధానముపొందిన ఔన్నత్యమునుగాని విచారించుట యనవసరము. ఏలనన 1914-21 మధ్యకాలము గొప్ప సాంఘిక వినాశనమునకు కారణమై, సోవియట్ రష్యాలోని పాఠశాలలు, కళాశాలలు పతనము నొందినవి ఉపాధ్యాయులు జీతములు లేక మాడవలసివచ్చినది.ఉండుటకు యిల్లు,చలికాచుకుండుటకు కుంపటి, లేవంటే యిక కాగితములు, కలాల విషయం చెప్పనవసరంలేదు అదివరకే యుద్ధభారంవలన క్రుంగిపోయిన సోవియట్ యూనియన్ విద్యావిషయంలో యెక్కువ శ్రద్ధతీసికొన లేకపోయింది. అందువలన పాఠశాలలను, అందలివిద్యార్థులను, యుద్ధపూర్వ పరిస్థితికి తెచ్చుటకే ఒక పుష్కరం పట్టినది.

ఇప్పటి సోవియట్ విద్యావిధానమునందలి విలక్షణమైనవిషయము "సార్వజనీనత" విద్యయనగా బాలబాలికలను జీవితమునకు తగియుండునట్లు తయారు చేయుట. ఈయుద్దేశములోనే సోవియట్ రష్యాయందలి విద్య, విధాయకముగా నెంచబడి, నిర్బంధముగాను, ఉచితముగాను, ప్రతిగ్రామమునందును, పట్టణమునందును, యెట్టి విచక్షణ లేక స్త్రీ పురుషుల కెల్లరకును, జాతి మత, వర్ణభేదములులేక, వెనుకబడిన జాతులవారితో సహా అందరకును యివ్వబడుచున్నది ప్రపంచములో మరియే భాగమునందు గూడ యీరీతి సార్వజనీనకమైన విద్య యివ్వబడుచున్నట్లుగాని, యివ్వనుద్దేశించినట్లుగాని, కనివిని యెరుగము.

కమ్యూనిజము సుస్థిరముగా స్థాపింపబడవలెనంటే ఆసంఘము నందలి ప్రతివ్యక్తియు ఆసంఘ జీవితములో పాల్గొనవలెను. కావున సంఘమునకు చైతన్య యుతమొనర్చుటకు సార్వజనీనకమైన అక్షరాస్యత యవసరము. "అక్షరాస్యతలేని వానికి రాచకీయములు శూన్యము" లనియు అట్టివారు మాట్లాడు రాచకీయములు పుక్కిటి పురాణములుగాను, అన్యోన్యాశ్రయాభావముతో కూడు

కొనిన నీచసంభాషణ యగునని" లెనిను మహాశయుడు చెప్పినాడు బోల్షివిక్కులు రాజ్యమునకు వచ్చినప్పుడు నూటికి 99 మంది నిరక్షరకుక్షులు రష్యాయందంతటను, సైబీరియా యందలి నివాసయోగ్య ప్రదేశములందును, యేవరోవృద్ధులో తప్ప మిగిలిన వారందరును యూసితినుండి ఉద్ధరించబడిరి. ఇటీవలనే సైన్యములోనికి చేర్చుకొనబడిన వారందరును చదువను వ్రాయను నేర్చినవారైయున్నారని ప్రకటించబడినది బోధనయెంత అసంపూర్తిగా నున్నను, పరికరములు లేకపోయినను, సోవియట్ రష్యాయందలి ప్రతిగ్రామము నందును పాఠశాలలను యేర్పాటు చేయుటకును, ఆయాగ్రామములలోని బాలబాలికలందరను బడికి రప్పించుటకును, కనీసము ఒక పుస్తకము పట్టినది, 1914లో బడిలో చదువుచున్నవారి సంఖ్య 7 మిలియన్లు మాత్రమే, 1929లో 11 మిలియన్లకు పైగానుండెను 1931 వరకు సార్వజనీనకమైన విద్యావిధాన వంతులు జరుపుటకు వీలుపడలేదు అప్పటినుండి బడిలో చదువుచున్నవారిసంఖ్య 19 మిలియన్లవరకు పెరిగినది. 1935 నాటికి సోవియట్ ఆసియా, కకేషియన్ పర్వతములు, ఆర్కిటిక్ ప్రాంతములోని ప్రతిమారుమూల విద్యాలయములు, వ్యాపించినవని చెప్పటకు వీలులేకపోయినను, విద్యాభ్యాసమునకై తమకాలమును పూర్తిగా నియోగించుటకై చేరినవారి సంఖ్య 26 మిలియన్లవరకు పెరిగినది అనగా ప్రతి ఆరుగురికి ఒక చదువు కొనినవాడున్నాడన్నమాట ఈలోగా 8 సం|| ల లోపు కిండర్ గార్టెన్ పల్లలకు, పాఠశాలా ప్రవేశమునకు పూర్వ శిక్షణ నిచ్చు సంస్థలలోని విద్యార్థుల సంఖ్య 6 మిలియనుల వరకు పెరిగినది. మొత్తం 30 మిలియనుల మంది, అంటే రష్యాలోని జనాభాలో ప్రతి ఐదుగురికి ఒకడు ఏదేని యొక తరగతి విద్యాభ్యాసమునకై తమ కాలమును పూర్తిగా వినియోగ మొనర్చుచున్నాడన్నమాట.

బ్రిటన్‌లోగాని మఱి యితర దేశాలయందలి సర్వజనీనతకంటె విలక్షణమై, భిన్నమైన సార్వజనీనత సోవియట్ రష్యాయందవలంబింపబడుచున్నది. సోవియట్ ప్రజాస్వామ్యమునందు మధ్యతరగతి ప్రజలకని గాని, ధనికవర్గమునకని గాని, ప్రత్యేకమైన పాఠశాల లేవియును నడుపబడుట లేదు పోషకులయొక్క హోదా, ఆదాయములతో సంబంధము లేకుండానే బడియీడు గలిగిన బాలబాలికల కందరకును, ఉన్నతవిద్య బడయునట్టి వయస్కులకును, వారి వారి వయః పరిమాణమును బట్టి యేర్పాటు చేయబడిన పాఠశాలలలో గాని. కాలేజీలలో గాని, చదివింప బడుచున్నారు. దశవర్ష పాఠశాలలలో స్టాలిన్, మొదలగు సోవియట్ ఉన్నతోద్యోగుల బిడ్డలు చదువుచుండుట చూడగలము వారిని ప్రత్యేకించి చూపిన, వారియొక్క స్వభావమునందును, పరిణామమునందును దుష్ఫలితములు కలుగునని, అట్లు చేయుట నిషేధింపబడినది ఇతర దేశములలో నములనందున్న పోషకుల, ఆదాయపు హోదాలను బట్టి, పాఠశాలలను విభజించు విధానమువల్ల పాఠశాలలందును, విద్యార్థులయందును, తరతమ తారతమ్యము పొడచూపుచున్నది అందువలన యీ విధానము పూర్తిగా తీసివేయబడినది.

ఇంతియగాక యీ సార్వజనీనతయందు మరియొక వైశిష్ట్యము గలదు. మొదటినుండియు బోల్షివిక్ కార్యక్రమము, సోవియటు యూనియనునందలి వివిధజాతులకు "వైజ్ఞానిక స్వపరిపాలన" (Cultural autonomy) నివ్వ సమకట్టినది విద్య యథార్థంగా సార్వజనికము గావలెనంటే, ప్రతి జాతియు (Race) తమ స్వభాషలో బోధించుకొనుట కవకాశము రావలెనను యభిప్రాయము కలిగియుండెను జారుకాలమున ప్రతివారును రష్యను భాషనే నేర్వవలెనని యుండెడిది. సోవియట్ కమ్యూనిజం పూర్తిగా దీనికి వ్యతిరేకించినది జాతియొక్క పెద్ద చిన్న భేదమెంచక ప్రతిభాషలోను పాఠశాలల నేర్పాటు చేసినది కొన్ని సందర్భములలో లిపిలేని భాషలకుగూడ పాఠశాలల నేర్పాటు చేయ యత్నించినది అట్టి భాషలకు లిపి అక్షరములను నిర్మించినది లిపి నిర్ణయమునకు రష్యనుభాష నాధారము జేసికొనిగాక, లాటిను భాష నాధారముగా గొని లిపిని కనుగొనినది ఆ భాషలో నారెన్నడును కనుగొని యుండని ప్రాథమిక పుస్తకముల నచ్చు వేయించినది 1935 లో రష్యాలో 80 రకముల భాషలలో బోధనజరుగుచున్నది. షుమారు 20 విదేశభాషలలో ప్రచురణలను చేయుటయేగాక, పై 80 భాషలలోను ప్రచురణ సంస్థలను ప్రభుత్వము నడపుచున్నది 1935 నాటికి 88 భాషలలో వార్తాపత్రికలు ప్రకటింపబడుచున్నవి.

1927 లో సోవియట్ నందలి విద్యాధికారులు

యీ జాతులను నాలుగు జట్టులుగా విభజించిరి మొదటిది.- రష్యియన్, యుక్రేనియన్, వైట్ రష్యియన్, జార్జియన్, ఆర్మీనియన్- యీ ఐదు జాతులలో, స్థానికముగానున్న కాలేజీలలోను, పరిశోధనా సంస్థలలోను, పాఠశాలలలోను, బోధనా విధానము ఆయా ప్రదేశములందలి భాషలలో జరుగును రెండవ జట్టు:- స్వంత పుస్తకములు, అక్షరములు, విద్యావంతులను గలిగి యుండిన జాతులు- వీరికి 18 సం॥ ల వరకును మాతృభాషలోనే శిక్షణ యివ్వబడును అంతకు పై వయస్సుగలవారు చదువు పాఠశాలలలో రష్యనుభాష ఉపయోగింప బడుచున్నది వివిధ ప్రాంతములలోని యున్నత పాఠశాలలలో, అందలి మాతృభాషలోను, వాఙ్మయములోను, కొన్ని స్థానములు పైపాఠశాలలో ప్రత్యేకించబడి యుండును మూడవజట్టు:- క్రొత్తగా అక్షరములు కనుగొనవలసి ఒకేచోట కలసి మెలసి యుండు క్రిక్కిరిసిన జాతులు- వీరికి ప్రాథమికవిద్య మాతృభాషలో చెప్పబడును. ఉన్నత పాఠశాలలలో సెకండరీ విద్య రష్యనుభాషలో నివ్వబడును నాలుగవజట్టు:- వీరు ఎప్పుడును సంచారము చేయుచుండు వారు చాల కొద్దిమంది వీరికి పుస్తకములుగాని, యక్షరములుగాని, లేవు ఇట్టివారికి పాఠశాలా ప్రవేశ పూర్వశిక్షణ, అనగా 8 ఏండ్లవరకు, రష్యను భాషలోనే యివ్వబడుచున్నది ఈ సార్వజనీనక పద్ధతిపై వెనుకబడిన జల్లాలలోని వారే యెక్కువ అభివృద్ధి గాంచినారు మచ్చునకు టార్టారు స్వపరిపాలితసోవియట్ సోషలిష్టు ప్రజాస్వామ్యమునందు పరిస్థితులను పరికింతము విప్లవమునకు పూర్వమిందు 15% మాత్రమే విద్యావంతులు గలరు పాఠశాలలు 35 మాత్రమే గలవు మొదటి తరగతి పాఠశాలలోనేగాక సప్తసంవత్సర పాఠశాలకు కూడ నిర్బంధ విద్య అమలు జరుపబడెను టార్టార్ రిపబ్లిక్ లో సార్వజనీనకమైన పాఠశాలా ప్రవేశ పూర్వవిద్యను నమలు జరుప యత్నించుచున్నది ఇందు 20 విశ్వకళాపరిషత్తులు గలవు (అనగా 18 సం॥ల పైబడినవారికి విద్య నిచ్చు కళాశాలలు) ఇందు 2371 విద్యార్థులుగలరు ఇవిగాక ప్రత్యేకముగా తమజాతీయ భాషలలోనే విద్యాబోధన చేయు నుపశాఖలు గలవు

ఈ విధముగా అన్నిజాతుల మాతృభాషల నభివృద్ధి పరచుటలో ముఖ్యముగా నాలుగు నుద్దేశములు గలవు సోవియట్ శక్తి శాశ్వతముగాను, దృఢముగాను, ఉండవలెనంటే ఐక్యత యవసరమని గుర్తింపబడినది ప్రతి మైనారిటీయును, తమ జాతియొక్క వైజ్ఞానిక సంపత్తి నశించకుండా యుండవలెనని, వైజ్ఞానిక స్వపరిపాలన కావలెనని, కోరుతుంది మాతృభాషలలో పాఠశాలలు లేనిది సోవియట్ రష్యాలోవలె నిరక్షరాస్యతా నిర్మూలనము దుస్సాధ్యము జాతీయభాషలేక యేకమ్యూనిస్టు సిద్ధాంతములుగాని, నాయకుల యుపన్యాసములుగాని, విరివియయిన ప్రచార మిచ్చుటకు వీలు లేదు మైనారిటీలను తమ స్వంతభాషలో పాఠశాలలను పెట్టుకొన నిచ్చుటవల్ల జాతీయమైన చీలికలు కలుగకుండుట ఆశ్చర్యకరము విద్యావిధానమునందు యుక్రేనునందుగాని, జార్జియాయందుగాని, స్థానికసామ్యములేదు ఈ ప్రదేశములందు వాడబడు భాషయుక్రేనుగాదు. రష్యనుగాదు, జార్జియనూగాదు ఒక గ్రామములో నవసరమగు కనీసపుసంఖ్య కలిగిన మైనారిటీలు గలచోట, వారి కొరకు ప్రత్యేక పాఠశాల నడుపబడి వారిభాషలో విద్య నొసంగబడును అట్లే యుక్రేనులో దాదాపు పోలిష్, ఇడ్డిష్, జర్మన్, గ్రీక్ మొదలగు 20 భాషలలో పాఠశాలలు గలవు. ఇట్లే యితర ప్రాంతములందు గూడ.

ఈవిధముగా జాగ్రత్తగ నేర్పరుపబడిన వివిధ రకములైన విద్యావిధానములందు, అద్భుతమైన ఐక్యత యేర్పడినది ప్రస్తుతము చాలభాగము ఉపాధ్యాయులందరును రష్యనులోనుండి తీసికొనబడి, రష్యనుభాషలోనే బోధనా శిక్షణ నొసంగబడినారు వారందరును రష్యను వాఙ్మయమునందే విద్యనొసంగబడిరి ప్రతిపాఠశాలయందును, మొదటి భాషగా గాకపోయినను, రెండవ భాషగానైనను రష్యను భాషను బోధింపక తప్పదు అములునందున్న పుస్తకములు పదింట తొమ్మిదిపాళ్లు రష్యను భాషలోనే యున్నవి మైనారిటీజాతులలో ఒక్క యుక్రేను అగ్రగామిగా నున్నది ఇచ్చట మాత్రము విద్యాబోధకులందరును ఆ జాతికి సంబంధించినవారై యున్నారు. మిగిలిన వారందరును. సామాన్య పాఠశాలలలో తప్ప మాస్కో, లెనిన్‌గ్రాడ్, కీవ్ ల నుండి తయారై వచ్చు వారిపైననే యాధారపడవలసియున్నది. [సశేషము]

# అఫీషియల్ సంవత్సరముగడిచిన మరుసటిరోజున పంపవలసిన అర్ధసంవత్సరపు రిటరన్

1-10-194 31-3-194 పాఠశాల పేరు.

1. గ్రామము పేరు. (2) స్కూలు పేరు (3) మేనేజరు పేరు (4) 31-3-42 తేదీ నాడు బడియీడు పిల్లలసంఖ్య.

| హిం | | మహ | | ఆది | | మొత్తం | |
|---|---|---|---|---|---|---|---|
| బా | బాలి | బా | బాలి | బా | బాలి | బా | బాలి |

(5) 4 వ కలం దాఖలా వారిలో బడులలో చదువువారు.

(6) ఇతరరికగ్నైజ్డు పాఠశాలలో చదువువారు.

| హిం | మహ | ఆది | మొ॥ | హిం | మహ | ఆది | మొ॥ |
|---|---|---|---|---|---|---|---|
| B G | B G | B G | B G | B G | B G | B G | B G |

(7) 1-10-41 రోలు

(8) 31-3-42 రోలు

| హిం | మహ | ఆది | మొ॥ | హిం | మహ | ఆది | మొ॥ |
|---|---|---|---|---|---|---|---|
| B G | B G | B G | B G | B G | B G | B G | B G |

(9) 1-10-41 ఉపాధ్యాయుల వివరములు

(a) వరుసనెంబరు (b) ఉపాధ్యాయుని పేరు (c) హోదా (d) యోగ్యతలు వివరములు.

(10) 31-3-42 ఉపాధ్యాయుల వివరములు

(a) వరుసనెంబరు (b) ఉపాధ్యాయుని పేరు (c) హోదా (d) యోగ్యతలు వివరములు.

(11) షెడ్యూల్ విద్యార్థులు బడిలో లేకుండుటకు, రోలుసంఖ్య తక్కువగా నుండుటకు కారణములు.

# స్కూలు చరిత్ర

సీరియల్ నెంబరు

రేంజి స్కూలు పేరు మేనేజరు పేరు

194 సంవత్సరము

1. గ్రామము 2. గ్రామజనాభా 3. గ్రామములో బడియీడుగల పిల్లలసంఖ్య

| హిం. | మహ. | ఆది. | మొత్తం. | హిం. | మహ. | ఆది. | మొత్తం. |
|---|---|---|---|---|---|---|---|
| M. F | M. F | M. F | M F | B. G | B. G | B. G | B. G |

4. పాఠశాలపేరు 5. కరస్పాండెంటు పేరు

6. మేనేజరు పేరు 7. రికగ్నిషన్ అయిన తరగతులు 8. రికగ్నిషన్ అయిన నంబరు తేది 9. బడివసతి పూర్తివివరములు 10. స్కూలు స్థలములు 11. బడి వసతి ఇటీవల అభివృద్ధిచేయబడినదా 12. బడిలోని పట్టీసంఖ్య తరగతి బాలురు, బాలికలు 13. ఉపాధ్యాయుల విద్యా యోగ్యతలు (a) వరుస నెంబరు (b) ఉపాధ్యాయుల పేర్లు (c) యోగ్యతలు భాష 14. అన్ని మతముల వారికి వసతి కలదా? బడిలో చదువుచున్న ఆది ఆంధ్రుల సంఖ్య 15. బడితోట 16. ఆటస్థలము 17. త్రాగుటకై నీళ్లు 18. ఆరోగ్యము శుభ్రత 19. డ్రిల్లు ఏ పద్ధతి 20. వాచకములు 21. బోధనోపకరణములు 22. గ్రాంటు ఎక్కువపొందు పారశాలా? తక్కువ పొందు పారశాలా? బడి ప్రారంభించినది మొదలు 23. పర్నిచరు గ్రాంటు వచ్చినదా? తేది 24. బిల్డింగు గ్రాంటు వచ్చినదా? తేది 25. తల్లిదండ్రుల సంఘము లేక కమిటీ ప్రారంభించిన తేది యీ సంవత్సరములో జరిపిన కార్యక్రమ వివరములు

# ప్రతి నెలకు పంపు నెలసరి లెఖ్ఖలో నుదహరించవలసిన జనాభా ష్టేటుమెంటు

| | హిందువులు | మహమ్మదీయులు | ఆదిఆంధ్రులు | మొత్తం |
|---|---|---|---|---|
| | మ+ఆ | మ+ఆ | మ+ఆ | మ+ఆ |
| మొత్తం జనాభా | | | | |
| చదువు ఈడు గలవారు | | | | |
| బడులలో చదువుచున్నవారు | | | | |
| చదువకుండ ఉన్నవారు | | | | |

---

# నెల్లూరుజిల్లా ప్రాథమిక విద్యాసంఘము

ఈ సంఘము రమారమి 28 సం॥ల నుండి ఈ జిల్లాలో ప్రాథమిక విద్యా వ్యాప్తికిని, ఉపాధ్యాయ అభివృద్ధికిని మిక్కిలి పాటుపడి పనిచేయుచుండెను. ఇందు కేవలము ప్రాథమికోపాధ్యాయులే గాక, జిల్లాలోని ప్రముఖులగు విద్యాభిమానులెందరో సభ్యులుగ చేరియున్నారు. ది 2-11-1938 తేదీన ఈసంఘము రిజిష్టరైనది. కడసారి మహాసభ బుచ్చిరెడ్డిపాలెములో 1938 సం॥ ఏప్రిల్ నెల 14-15 తేదీలలో జరిగియుండెను. ఆ సభలో యెన్నుకొనిన కార్యదర్శి శ్రీయుత కొప్పోలు వెంకట్రావుగారున్నూ, సహాయ కార్యదర్శి శ్రీయుత వేమూరు రామయ్యగారున్నూ మిక్కిలి ఉత్సాహముతో పని చేసి సంఘమును రిజిష్టరు చేయించుటయే గాక శాశ్వతనిధి వసూలు చేయుటకూడా తీవ్రముగా ప్రయత్నించి కొంత ఆందోళన

సాగించి సంఘమున కొకప్రత్యేకతను కల్పించిరి. కాని తర్వాత వీరెందులకో సంఘ కార్యక్రమమునందు పూర్తిగా ఉపేక్షవహించిరి. ఇంతవరకు మహాసభ జరుపలేదు. నేనున్నూ, శ్రీ పల్లెకొండ రంగయ్యగారున్ను మహాసభ జరుపుటకు ప్రయత్నించి కార్యదర్శుల సహాయము కోరితిమి. కాని వారేలకో సహాయపడనందున ఆప్రయత్నములు విరమించుకొంటిమి. ఈసంఘము తరపున వసూలైన శాశ్వతనిధి మొత్తము బుచ్చిరెడ్డిపాలెము సేవింగ్సు బ్యాంకులో శ్రీ చతుర్వేదుల సూర్యనారాయణ శర్మగారిపేరుతో వేయబడియుండెను. ఈవల కార్యదర్శులు కొంత వసూలుచేసియుండిరి. ఈధనమునుగురించిన వివరములు తెలుపువారు కనుపింపరు. ఇటీవల మహాసభ జరుపుడని కార్యదర్శులనుకోరగా క్రొత్తగావెలువడిన G. O లననుసరించి ఈసంఘమిక నుండుటకు వీలు కాదందురు. ఈ క్రొత్త ఉత్తర్వులు వెలువడినపిమ్మట కూడా రాష్ట్రములో అనేక జిల్లా సంఘములు జరుగుచునే యున్నవి. కాని యీసంఘమేల జరుగరాదో? ఎవరు జరుపరాదనిరో తెలియకున్నది. ఒకవేళ జరుగుటకు వీలుకానిచో సంఘమును తమంతటతామే రద్దుచేయుటకు కార్యదర్శుల కెంతమాత్రము అధికారము లేదు. మహాసభ జరిపి ఈ విషయమును తీర్మానించవలసియున్నది. క్రొత్త జి. ఓ. లున్నను ఈ సంఘము జరుపుట కెట్టి యాటంకములు లేవనియే నాతలంపు. అధికారులు ప్రత్యక్షముగా వలదనునంతవఱకు యీ సంఘమును నడిపించుట కెట్టి యభ్యంతరమునులేదు. సంఘమునందు కార్యదర్శులు శ్రద్ధవహించనపుడు కార్యనిర్వాహక సంఘ సభ్యులుసంఘమును నడిపింపబాధ్యులై యుందురు.

కాన కార్యనిర్వాహక సంఘసభ్యులు శ్రద్ధవహించి మహాసభ జరిపించుటకు తగిన యేర్పాట్లు చేయవలెనని ప్రార్థించుచున్నాను. వారు సంఘక్షేమము నాలోచించి మహాసభ జరుపవలసిన తేది - స్థలము - అధ్యక్షులపేరు మొదలగు వివరములతో తమ అంగీకారమును ఒకపోస్టుకార్డుమూలముగా నాకు తెలిపినచో మహాసభజరుపుటకు నేను అన్ని యేర్పాట్లుచేయుదునుమహాసభ కావలి గ్రామములో రాబోవు వేసవిశెలవులలో జరుపుట మేలని నాయభిప్రాయము. అధ్యక్షుని పేరు సూచించుటలో సులువుగా నంగీకరించు వారుగాను, సభజరుగు స్థలమునకు సమీపములోనుండు వారుగను, ఉండునట్లు ఆలోచింప ప్రార్థన. కార్యనిర్వాహక సభ్యుల పేర్లు యీక్రింద చూపితిని. వీరి ప్రస్తుతవిలాసములు నాకు తెలియదు. ఈ పత్రికచదువు పాఠకమహాశయులు తమకు పరిచయులగు యీ క్రింది సభ్యులకీ విషయము తెలిపి సంఘాభివృద్ధికి తోడ్పడ మిక్కిలి ప్రార్థించుకొనుచున్నాను. కార్యనిర్వాహకసభ్యు లుపేక్షవహించి యింత కాలము పోషించి పెంచిన సంఘమును నిర్మూలించవలదని వినయముతో ప్రార్థించుచున్నాను.

సభ్యులపేర్లు:- (1) శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య పంతులుగారు (M. A.) (2) శ్రీ లేబూరు సుబ్బరామిరెడ్డిగారు (3) కొప్పోలువెంకట్రావుగారు (4) వేమూరు రామయ్యగారు (5) సి. డేవిడ్ గారు (6) పెళ్లూరు వరదయ్యగారు (7) జి.

శ్రీరామాలుగారు (8) మారెళ్ళ కృష్ణయ్యగారు (9) సూ. కోటయ్యగారు (10) వేదగిరి సుబ్బరాయశర్మగారు (11) పి వి. శేషయ్యగారు (12) కొండపి నారాయణ రావుగారు (13) కె. ఆదినారాయణగారు (14) పి. పుల్లయ్యగారు (15) కనుమూళ్ళగోపాలకృష్ణరావుగారు (16) కె. జగన్నాథాచార్యులుగారు, (17) డి. రామకృష్ణయ్యగారు, (18) డి. వెంకట కృష్ణయ్యగారు, (19) పి. కొండయ్యగారు, (20) పల్లె కొండ రంగయ్యగారు, (21) చతుర్వేదుల సూర్యనారాయణ శర్మగారు.

ఇట్లు,

సూరపరాజు కోటయ్య.

(కా. ని. సం. సభ్యుడు)

గుడ్లూరు. (V1a) కావలి.

---

## కందుకూరు తాలూకా ప్రాథమిక విద్యామహాసభ

## కందుకూరు

ఈ మహాసభ 4-4-42 నేదీన కందుకూరులో శ్రీ గుత్తం వేంకటసుబ్బరామయ్య (కాలేజి లెక్చరర్) పంతులుగారి అధిపత్యమున సమావేశమయ్యెను. అన్నిరకముల పాఠశాలలనుండి 250 మంది ఉపాధ్యాయులు - ఉపాధ్యాయినులు - మేనేజరులు వచ్చిరి. శ్రీయుత నల్లమోతు చెంచురామానాయుడుగారు (జిల్లాబోర్డు వైస్ ప్రెసిడెంటు) శ్రీయుత శిష్టా సుబ్రహ్మణ్యము పంతులు (సీనియర్ డిప్యూటీ యిన్స్పెక్టరు)గారు శ్రీయుత శ్రీరామగిరి నరసింగరావుపంతులు (జూనియర్ డిప్యూటీ యినస్పెక్టరు)గారు శ్రీమతి సి. దేవి (గరల్సుస్కూళ్ల దొరసానమ్మ) గారు శ్రీయుత తాడికొండ వెంకట సుబ్బానాయుడుగారు శ్రీయుత వి. నరసింగరావు పంతులు (ఆహ్వానసంఘాధ్యక్షులు) గారు మొదలగు ప్రముఖులు సభనలంకరించియుండిరి. శ్రీయుత వి. వెంకటరత్నంనాయుడు (సబ్ మేజిస్ట్రేటు) గారు వస్తుప్రదర్శనమును తెఱచి మనదేశములో చేతిపరిశ్రమకు గల ప్రాముఖ్యమునుగురించి ఉపన్యసించిరి. సామాన్యజనులు ప్రాథమిక విద్యకు విముఖులగుటకు కారణమేమి? అను విషయమునుగురించి శ్రీ పి. చెన్నారాయుడు (M. A; B. Ed.) గారున్నూ, ప్రాథమిక విద్యావ్యాప్తినిగురించి శ్రీయుత కమతం షణ్ముఖం (M. L. A) గారున్నూ ఉపన్యసించిరి. వెంకటరామా, రామా, ఓరియంటల్ పబ్లిషింగు కంపెనీలవారు వారి పుస్తకములు ప్రదర్శించిరి. పలువిధములగు తీర్మానములు కావించిరి. పిమ్మట యెన్నికలు జరుపబడెను. అందుబోర్డు టీచర్సు యూనియనుకు ఈక్రిందివారి నెన్నుకొనిరి. రాత్రి 8 గంటలకు శ్రీకమతం షణ్ముఖంగారు "నందనారు చరిత్రము"ను రసవంతముగు హరికథ చెప్పిరి.

బోర్డు టీచర్సు యూనియన్‌కు (1) శ్రీ ఆర్. హనుమంతరావు ప్రెసిడెంటు (2) శ్రీ సూ. కోటయ్య కార్యదర్శి (3) శ్రీ పి. హనుమంతరావు కోశాధిపతి (4) శ్రీ. వై. వెంకటేశ్వర్లు (5) డబ్లియు హనుమంతరావు (6) యన్ రామారావు (7)

సైద్ అబ్దుల్ రహిమాన్ (8) టి. వెంకటసుబ్బయ్య (9) బి. కరుణమ్మగార్లు సభ్యులుగా నెన్నుకొనబడిరి. సూ. కోటయ్య, కార్యదర్శి.

---

28—4—42 తేది గడేకల్లు బోర్డుస్కూలునందు శ్రీ డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారైన చాగంటి వీరభద్రరావుగారి ద్వారా శ్రీ గడేకల్లు గ్రామకరణము విరూపాక్షరెడ్డిగారి అధ్యక్షతక్రింద బడిపిల్లల తల్లిదండ్రాదుల విద్యాపోషక సంఘము జరుపబడెను. ఇందుకు గ్రామస్థులందరు హాజరైరి. ఇందులో యుద్ధమును గురించి, పాఠశాలను, అందలి లోటుపాటులను, బాలబాలికల విద్యనుగురించి అన్నివిషయములు విశదమగునట్లు, డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారగు శ్రీ Ch వీరభద్రరావుగారు సభలో ద్రుపన్యాసమిచ్చిరి సభ్యులందరుకూడా పాఠశాలవిషయమై మాట్లాడిరి. తదనంతరం మంగళముతో నాటిసభ ముగింపబడెను.

బి. వి. సంజీవరాయుడు,
గడేకల్లు

---

11-5-42 వ తేది గుంటూరు సంగడిగుంట మునిసిపల్ హిందూ బాలికల పాఠశాలవారిచే Parents day సాయంత్రం 5 గంటలకు కన్యకాపరమేశ్వరి అమ్మవారి సత్రములో శ్రీ పొత్తూరి వెంకటప్పయ్య పంతులు Vice Chairman, Guntur Municipality గారి అధ్యక్షతను జరుపబడెను.

Dr రాచపూడి సుబ్బారావు, M. B B S దేలిశెట్టి పుల్లయ్యగార్లు స్త్రీ విద్య ఆవశ్యకతను గురించి విపులముగా చెప్పిరి.

వైశ్యశిఖామణి శ్రీ రావుబహదూర్ తెల్లాకుల జాలయ్య శ్రేష్టి (గుంటూరు పురపాలక సంఘాధ్యక్షులు) గారిచే స్త్రీ విద్యను గురించి, తల్లిదండ్రుల బాధ్యతను గురించి విపులముగా దీర్ఘమైన ఉపన్యాసం యివ్వబడెను. స్త్రీవిద్యకై గుంటూరు మునిసిపల్ సంఘంవారు చాలా కృషిచేయుచున్నారనియు, స్త్రీకళాశాలపై సంఘంవారు తమ యాజమాన్యమున జరిపించుటకు తగు ప్రయత్నం చేయుచున్నారనియు కొద్దిరోజులలో అది స్థిరపర్చెదరనియు నుడివిరి.

సదరు పాఠశాల బాలికలచే సంగీతము, నృత్యము, శ్రీరామ వనవాసము, నలోపాఖ్యానము నాటకములు సదరు స్కూలు హెడ్‌మిస్ట్రెసు జి. సత్యవేదవతిగారి యాజమాన్యమున అతినైపుణ్యముగా ప్రదర్శించిరి

రామాఅండ్ కో., గుంటూరివారిచేతను, మరి యితరులచేతను బాలికలకు పుస్తకములు బహుమానములుగా యివ్వబడెను.

G. రాబర్టుగారి వందనములతో సభముగింపబడెను.

T. Ramalingeswara Rao,
Rama & Co. Guntur.

# పెండ్లి ప్రయాణము

(డా. నాగేశ్వరరావు, 8వ తరగతి బోర్డు హయ్యరు ఎలిమెంటరీస్కూలు - కొవ్వలి)

నాలుగు సంవత్సరములకు పూర్వము నా బంధుకోటిలో నొకని వివాహము కొఱకు నేను నాపితృపాదులతో గూడి రాజమహేంద్రవరమునకు బయనమైతిని.

తద్వివాహ మహోత్సవానంతర మింటికి బోనిశ్చయించి ప్రయాణమైతిమి; కాని ధూమశకటము దాటిపోయినది. అంత నిక గత్యంతరములేక పెండ్లివారికై నిర్ణయింపబడిన పడవపై నెక్కితిమి

అది గ్రీష్మఋతువు. అయినను కారుమబ్బులు నలువైపుల గ్రమ్మసాగినవి. నాకు పడవప్రయాణమన్న మిక్కిలిభయము. అందును గౌతమీనదియందు పడవ. పడవ నదీమధ్యస్థమైనది. ఝంఝూమారుతము విజృంభింపసాగినది. నా భయమునకుదోడు తూగుటుయ్యాలలోని బాలునిచందమున నానావ నదీమధ్యమున నూగుచుండెను.

అప్పుడు పడవవాండ్రు ప్రయాణీకుల నందఱను 'జాగ్రత్తగా నుండు' డని చెప్పి తెఱచాపదింపిరి. నదీ మధ్యస్థముననున్న యొక యిసుకతిన్నె వెంబడి పడవ నెమ్మదిగా జరుగుచుండెను. దైవవశమున ఝంఝూమారుతము కాలక్రమమున మందమారుతమై పరిణమించెను.

అట్టితరి పడవవాండ్రు, ప్రయాణీకులు, నేను మ్రొక్కుకొనిన మ్రొక్కులకు గాని, ప్రార్థించిన ప్రార్థనలకుగాని లెక్కయేలేదు. మేమా పరమేశ్వరుని వేవిధముల గీర్తించితిమి.

'చాలు-భగవంతుడా!' యనుకొని యిద్దరినెట్టులో చేరి కొవ్వూరులో రైలు నెక్కి స్వగృహప్రవేశ మొనర్చితిమి.

N.B:—ఇందు చదువదగిన విషయ మంతగా లేకున్నను విద్యార్థి రచించుటచే అతనిని ప్రోత్సహించుటకై యిది ప్రచురింపఁబడినది. —సం.

---

# తలిదండ్రుల సమావేశము - రావెల

ది 30-4-1942 తేదీన తల్లిదండ్రుల సంఘసమావేశము గావింపబడెను. దాదాపు 300 మంది ప్రజలు హాజరైరి. ప్రస్తుత యుద్ధపరిస్థితులను గూర్చియు, A. R. P. పద్ధతులను గూర్చియు, హెడ్మాష్టరు రావెల వెంకటసుబ్బారావుగారు విశదీకరించి చెప్పిరి. శ్రీ మద్రాసు గవర్నరుగారి యుద్ధఫండునకు ప్రతివారు తమచేతనైనంత సహాయమును చేయువలసినదిగా చెప్పిరి.

---

# శ్రీరామ నామ సప్తాహము

[ రా వె ల ]

శ్రీ చిత్రభానునామ సంవత్సరం చైత్ర శు ౫ లు ఆదివారము నుండి (21-3-42 యీా శు ౧౧ (ది 28-3-42) వరకు యీా గ్రామములో శ్రీరామ నామ సప్తాహము జరుపబడెను. అందు ముఖ్యముగా శిరిపురపు విశ్వేశ్వర శాస్త్రిగారు హిందూ మతమునుగూర్చి ఉపన్యసించిరి. శ్రీ చిల్లర పుల్లయ్యా భాగవతారుగారిచే "సుధన్వోపాఖ్యానము", శ్రీ విశ్వనాథుని వేంకటేశ్వరగుప్తగారిచే "భక్త మార్కండేయ చరిత్ర" హరికథా కాలక్షేపము జరుపబడెను. బీదలకు విరివిగా అన్నదానము చేయబడెను.

---

## శబ్ద సమస్యా పూరణము నెం. 5 రు సరియైన జవాబు

### (1) అనుమానము (2) అభిమానము (3) ఉపకారము (4) తోటస్థలము (5) వివాదములు

1 తప్పుగలవారు:—శ్రీ వి. మురహరిరావుగారు (8 కూపనులు) రు 5-0-0

2 తప్పులు గలవారు:—శ్రీ G. V. L నరసింహారావు 2. టి. శేషిరెడ్డిగారు 3. యం. మహబూబ్ బేగ్ 4. R. హనుమంతరావు గార్లు ఒక్కొక్కరికి రు 0-12-0

ప్రోత్సాహబహుమతుల క్రింద ! శ్రీ యం. రామయ్యా 2. జి. సత్యనారాయణ 3. ఆర్. సత్యనారాయణ 4. పి. వెంకటకృష్ణయ్యా గార్లకు శ్రీ మల్లేశ్వర తారావళి పుస్తకములు 5. శ్రీ వి. వెంకట సుబ్రహ్మణ్యాం 6. యస్. అబ్దుల్లాగార్లకు రు 0-6-0 లు (ఒక్కొక్కరికి) బహుమతులు ది 20-5-1942 తేదీన పంపబడును.

---

శ్రీ సూర్యనారాయణ పరబ్రహ్మణేనమః

# ఆదిత్య హృదయస్తోత్ర మండలి పోరంకి

## ప్రథమాచరణ

స్వధర్మము:—లోకకల్యాణమునకై అను స్త్రీ పురుషులందఱు వయోనిర్ణయము లేక ప్రతిదినము పగలు 10 గంటలవేళ నిర్మలమనస్సుతో నిమిషకాలము సకల దేవతాస్వరూపుఁడును, ప్రత్యక్షదైవతము నగు శ్రీ సూర్యనారాయణమూర్తిని

సచ్చిదానందస్వరూపా! సర్వేశ్వరా! జగద్రక్షకా! సర్వానిష్టముల నివారించి
శాశ్వతశాంతి, సుఖానందముల నొసంగుము.

అని ప్రార్థించుచు ముమ్మాఱు నమస్కరింపవలయును ఈనిష్ట (స్పర్శ, దర్శన, ధ్యానముల)చే శారీరిక, మానసిక, దైవికబలములు సమకూరి తరించుట కవకాశము కలుగును.

అవసరము:—ఇట్లనుష్ఠింతుమని ప్రతినచేయువారు ఈమండలి ప్రథమాచరణ సభ్యులుగాఁ జేరి విశేషములు తెలిసికొనుచుండుట.

చిరునామా:—పూర్తి పేరు, కులము, వయస్సు, చిరునామా, సంతకం లేక నిశాని

సభ్యులచందా:—నియమము తప్పక ప్రార్థన జరుపుచుందు మని వాగ్దానము చేయుచు సంఘముల యేర్పాటుతో ఆప్తులను ప్రోత్సహించు చుండుటయే.

ప్రాముఖ్యము:—మహాత్ముల సలహాలు వందనములతో నందుకొనుట.

విషయము:—ఆరంభమున అణువు అభ్యాసారూఢదశల అఖండాకారము.

మనవి —ప్రథమాచరణఫలము నొంది 1ద్వితీయ 2తృతీయాచరణల యందు పాల్గొనవలయుననియు, ఆచార్య పురుషోత్తములు, పవిత్రాంతఃకరణగల విద్యార్థులతో ఆచరణ జ్ఞాన ధర్మములు నిర్వర్తించు చుండవలయుననియు.

ఫలము:—నిత్యమై నిరుపాధికమై నిరతిశయమైన సుఖస్వరూపానందమే.

వివరములు:—కోరువారు పోస్టేజి పంపు చుండవలయును.

1 ద్వితీయాచరణ—నియమపూర్వక ఆదిత్య హృదయస్తోత్ర పారాయణము, ధ్యానము.
2 తృతీయాచరణ—జ్ఞానస్వరూపమైన బ్రహ్మానుభవము

పోరంకి, P. O.
కృష్ణాజిల్లా.
13—5—42.

ఇట్లు,
ఆదిత్యహృదయ స్తోత్రమండలి,

ప్రచురణసహాయకులు: సభ్యులు, శ్రీ తాడిగడప శేషగిరిరావుగారు.

వేమూరి వెంకట కృష్ణమసెట్టి అండ్ సన్సు వారి, ఎ కణ్ణన్‌సెట్టి అండ్ కో., 786, ఎస్ప్లనేడు - మద్రాసు వారిచే ప్రచురింప బడుచుండెడి "ఆనందాశ్రమ గ్రంథ రత్నమాల" పుస్తకము లన్నిటికిని మేము సంపూర్ణ హక్కుదార్లమై యున్నాము ఈ పుస్తకములకును యితర పుస్తకములకును, యీదిగువ చిరునామాకు వ్రాయవలయును భారీగా ఆర్డరిచ్చువారికి మంచి కమీషను యివ్వబడును

## శ్రీమద్భగవద్గీతా-ప్రతిపద టీకాభాష్య విశేషార్థ సహితము.

| | | | |
|---|---|---|---|
| క్యాలికో బైండు, గిల్టుపేరు గలది. | 3 | 4 | 0 |
| డిటో ఆంధ్రతాత్పర్య సహితము, క్యాలికో బైండు | 1 | 4 | 0 |
| డిటో డిటో రేపర్ బైండు | 1 | 0 | 0 |
| డిటో ఆంధ్రవచనము చిన్నసైజు, క్యాలికో బైండు | 0 | 6 | 0 |
| డిటో డిటో రేపర్ బైండు | 0 | 5 | 0 |

## శ్రీమదాంధ్రమహాభారతము.

| | | | |
|---|---|---|---|
| 1 ఆది, సభాపర్వములుగల సంపుటము | 2 | 0 | 0 |
| 2 అరణ్యపర్వము. | 2 | 0 | 0 |
| 3 విరాటోద్యోగ పర్వములు | 2 | 0 | 0 |
| 4 కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు | 2 | 0 | 0 |
| 5 భీష్మ, ద్రోణ పర్వములు | 2 | 0 | 0 |
| 6 శాంతిపర్వము. | 2 | 0 | 0 |
| 7 అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు గల సంపుటము. | 2 | 0 | 0 |
| 1 ఆదిపంచకము - ఒకటే సంపుటము | 5 | 8 | 0 |
| 2 యుద్ధషట్కము డిటో | 3 | 12 | 0 |
| 3 శాంతిసప్తకము డిటో | 3 | 12 | 0 |
| భాస్కరరామాయణము | 4 | 0 | 0 |
| శ్రీకృష్ణకర్ణామృతము | 1 | 8 | 0 |
| శ్రీరామకర్ణామృతము | 1 | 8 | 0 |
| భర్తృహరిసుభాషితము | 2 | 0 | 0 |
| అమరకోశము-త్రికాండము-సటీకము క్యాలికోబైండు చేయఁబడినది. | 1 | 4 | 0 |
| డిటో అట్టబైండు | 1 | 0 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము అట్టబైండు. | 0 | 6 | 0 |

## శ్రీమదాంధ్ర మహాభాగవతము (పద్యకావ్యము-పోతనప్రణీతము)

| | | | |
|---|---|---|---|
| సంపూర్ణ ప్రతి ఒకే సంపుటము | 5 | 0 | 0 |
| సంపూర్ణప్రతి రెండుసంపుటములుగా | 6 | 8 | 0 |
| సంపూర్ణప్రతి మూఁడుసంపుటములుగా ప్రథమ, ద్వితీయ, తృతీయ చతుర్థస్కంధములుక్యాలికోబైండుగిల్టుపేరుగలది | 2 | 8 | 0 |
| పంచమ, షష్ఠమ, సప్తమ, అష్టమ, నవమస్కంధములుగల సంపుటము క్యాలికోబైండు, గిల్టుపేరుతో | 2 | 8 | 0 |
| దశమ, ఏకాదశ ద్వాదశ స్కంధములు గల సంపుటము క్యాలికో బైండు, గిల్టుపేరు గలది | 2 | 8 | 0 |
| గజేంద్రమోక్షము-క్యాలికోబైండు | 0 | 8 | 0 |
| డిటో అట్టబైండు | 0 | 6 | 0 |
| రుక్మిణీకల్యాణము-క్యాలికోబైండు | 0 | 8 | 0 |
| డిటో అట్టబైండు | 0 | 6 | 0 |
| నలచరిత్రము - అట్టబైండు. | 0 | 6 | 0 |
| ముకుందమాల -సటీకాతాత్పర్యము. | 0 | 4 | 0 |
| ఆదిత్యహృదయము-సటీకాతాత్పర్యము. | 0 | 2 | [illegible] |
| నీతిశాస్త్రము, సటీకాతాత్పర్యము | 0 | 2 | [illegible] |
| భజగోవింద శ్లోకములు. టీకాతాత్పర్యసహితము | 0 | [illegible] | 0 |
| శ్రీలక్ష్మీనృసింహ స్తోత్రము. టీకాతాత్పర్య సహితము. | 0 | 2 | 0 |
| శ్రీ సహస్రనామ స్తబకము. క్యాలికో బైండు చేయఁబడినవి. | 0 | 8 | 0 |
| రేపరు బైండు. | 0 | 6 | 0 |
| శ్రీ గోపాల సహస్రనామ స్తోత్రము | 0 | 1 | [illegible] |
| సప్తమస్కంధము - మూలము. | 0 | [illegible] | 0 |
| భోగినీ దండకము | 0 | 1 | 0 |

# రామా అండ్ కో.,

హెడ్డాఫీసు:—ఏలూరు, బ్రాంచెస్:— మదరాసు-గుంటూరు-రాజమండ్రి.




1941 వ సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి

# ప్రాథమిక భూగోళములు

శ్రీ K. వెంకట్రావు B A, L T., గారిచే

2 - 3 - 4 - 5 - 6 - 7 - 8 తరగతులకు

వలయువారు:—రామా అండ్ కో.,

ఏలూరు - మద్రాసు - గుంటూరు - రాజమండ్రి.